వెల : 20-00

ట్రస్ట్ సంపాదకుడు : చేకూరి రామారావు

మొదటి ముద్రణ : 1980, జులై

పునర్ముద్రణ : 1981, 1984, 1987, 1992, 1998

వివరాలకు : హైదరాబాద్ బుక్ ట్రస్ట్
ఇ.నెం. 1-1-16/10సి,
జవహర్ నగర్, ఆర్.టి.సి. 'X' రోడ్స్,
హైదరాబాద్ - 500 020.
ఫోన్ : 7611232.

ఒకటిన్నర శతాబ్దాల కిందట

వేమనపద్యాల తాటాకు ప్రతులను సేకరించి,

వాటికి శుద్ధప్రతులు రాయించి,

పాఠనిర్ణయాలు చేసి,

నిర్దుష్టమైన పద్ధతిలో మొట్టమొదటిసారి

వేమన పద్యాలను వెలుగులోకి తెచ్చిన

కుంఫిణీ ఉద్యోగి

చార్లెస్ ఫిలిప్ బ్రౌన్‌కు

# విషయ విభాగం

# వేమన్న ఆదర్శం

తనకాలపు పరిధిలోనైనా సామాజిక చైతన్య దృష్టితో కవిత్వం చెప్పిన తొలి తెలుగు కవి వేమన్న. అదే దృష్టితో రచన చేస్తున్న ఈనాటి కవులు తమకన్నా పూర్వుల సంప్రదాయాన్ని తెలుసుకోటం ఆరోగ్యకరమే గాక అవసరమని కూడా భావిస్తున్నాం. వెనకటి మంచిని జీర్ణించుకొని కొత్త పరిస్థితులను గుర్తించి ముందు చూపుతో రచనలు చేయటం ఈనాటి రచయితల కర్తవ్యం.

ఆనాటి (17వ శతాబ్దం) సామాజిక పరిస్థితులను వేమన్న సమూలంగా అర్థంచేసుకున్నాడని చెప్పలేం. గొప్ప, పేద తారతమ్యాలు అర్థం చేసుకోగలిగాడు గాని వాటి వెనకాల ఉన్న ఆర్థిక వ్యవస్థ లోటుపాటులు తెలుసుకోటానికి వేమన్న ఆర్థికశాస్త్రవేత్త కాదు. వేశ్యల గురించి గాని, అసలు స్త్రీల గురించి గాని వేమన్నకు కనీసం ఉదారమైన అభిప్రాయాలు కూడా ఉన్నట్లు లేదు. అయితే తన కాలాన్ని మించి కొన్ని విషయాల్లో ముందుకు చూడగలిగిన కవిగా వేమన్నను మనం గౌరవించాలి. విగ్రహారాధనను వ్యతిరేకించాడు. శైవ వైష్ణవ మతాలవారి ఆర్భాటాలను, వారి దురాచారాలను, మోసాలను బట్టబయలు చేశాడు. చిలుక పలుకుల చదువులను విమర్శించాడు. కాకులకు పిండాలు పెట్టటం వంటి మూర్ఖాచారాలను తీవ్రంగా ఖండించాడు. శ్రమశక్తిలోనే సర్వమూ ఉన్నది అనేంత నిశిత పరిశీలన చెయ్యగలిగిన వేమన్న మామూలు కవికాడు, తనకాలపు చట్రంలో ఇమడని గొప్ప కవి.

వేమన్న రచనా మార్గంలో మూడు అంశాలు గుర్తించవచ్చు.
1. ప్రజల భాషలో ప్రచారంగా ఉన్న పదాలను, మాండలికాలను ప్రయో

గించి ప్రజలకు సన్నిహితమైన రచన చెయ్యటం. 2. చెప్పదలచుకున్న భావాన్ని తగిన విస్తీర్ణంలోనే క్లుప్తంగా చెప్పటం. 3. ఊహలోనుంచికాక జీవితం నుంచి ఉపమానాలను ఏరుకోవటం. కవితా దృక్పథం విషయంలో మాత్రమే కాక రచనా విధానంలో కూడా వేమన్న ఆదర్శం నుంచి ఈనాటి కవులు నేర్చుకోవలసింది చాలా ఉందని దృఢంగా భావిస్తున్నాం.

వేమన్న గురించి ఇది పరిశోధన గ్రంథం కాదు. వేమన్న పద్య సర్వస్వ సంకలనం కాదు. వేమన్న పద్యాలలో ప్రసిద్ధమైన ఆటవెలదులలో ఈనాటి పరిస్థితులలోనూ పూర్తిగా కాలదోషం పట్టలేదు అనుకున్న వాటిని కొన్నిటిని ఏరి తెలుగు పాఠకులకు పరిచయం చెయ్యటమే మా ఉద్దేశం. వేమన్న గురించి ప్రత్యేక పరిశోధన చేసిన మా డా॥ గోపి ఆ పద్యాల ముందు వెనుకలు చూపే విపులమైన పీఠికా, సరసమైన వ్యాఖ్యా కూర్చాడు. పద్యాల పాఠ నిర్ణయంలో విశేషంగా శ్రమపడ్డాడు. ప్రచురణ సంస్థ తరపున అతనికి ప్రత్యేకాభినందనలు.

ఈ కృషిని మా పాఠకులు తప్పకుండా ఆదరించగలరని ఇకముందు చెయ్యబోయే మా ప్రయత్నాలకు ప్రోత్సాహమియ్యగలరని మేం నిశ్చయంగా నమ్ముతున్నాం.

— చేకూరి రామారావు

8-7-1980

# రెండో ముద్రణ సందర్భంలో

తెలుగు పాఠకుల్లో విజ్ఞానచైతన్యాలను కలిగించటం హైదరాబాద్ బుక్ ట్రస్టు లక్ష్యంగా పెట్టుకున్న ప్రధానాశయాలు. అందుకనుగుణంగా 'వేమన్న వాదం' మొదటి ముద్రణతో పాఠకులతో పరిచయం ఏర్పరచు కున్నాం. మా ప్రయత్నాన్ని పాఠకలోకం హర్షించినందుకు ఎంతో ఆనం దిస్తున్నాం. సంవత్సరం తిరక్కుండానే 'వేమన్న వాదం' సాధారణ ప్రతు లన్నీ అమ్ముడయిపోయినాయి. అంతేకాక ఈ పుస్తకాన్ని చదివినవారు ట్రస్టును అభినందిస్తూ ఉత్తరాలు రాశారు.

తెలుగువారిని అవాస్తవిక భ్రమల్లో ముంచెత్తే కాల్పనిక సాహిత్యం కొంతకాలం నుంచీ తెలుగునాట స్వైరవిహారం చేస్తున్నది. ఇది చాలక ఇటీవల మంత్ర తంత్రాలతో, గడుసుదయ్యాల్ల కథలతో కుహనా శాస్త్రీయ ధోరణిలో మూఢవిశ్వాసాలకు కొత్తవేషం వేసే సాహిత్య మొకటి బయలుదేరింది. వీటి తాకిడికి తట్టుకొని వేమన్న వాదంతో మొదలైన బుక్ ట్రస్టు పుస్తకాలు పాఠకుల్లోకి చొచ్చుకుపోవటం మాకు ప్రత్యేకంగా సంతృప్తి కలిగించే విషయం. కొన్ని పరిమితులకు లోబడి అయినా 'వేమన్న వాదం' ఈ అశాస్త్రీయభావాలను ఎదుర్కోగలదని మా విశ్వాసం. అందువల్ల వేమన్న వాదం అవసరం ఇంకా వుంది. ఈ పుస్తకం రెండో ముద్రణ తీసుకురాగలుగుతున్నందుకు సంతోషిస్తున్నాం.

ఏరుకున్న పద్యాలు మొదటివే అయినా, ఈ రెండో ముద్రణ మొదటిదానికన్నా మెరుగైనది. నిరంతర పరిశోధనాశీలి అయిన గోపీ తన ఇటీవలి శోధనలో దొరికిన కొత్త పాఠాలతో పూర్వముద్రిత పద్యాలను సవ రించాడు. వాటిని అనుసరించి వ్యాఖ్యానాన్ని కూడా సవరించాడు. ఇతర పద్యాలకు కొత్త ఆలోచనలతో పాత వ్యాఖ్యానాన్ని మార్చాడు. కొన్నిచోట్ల మరింత వివరణను చేర్చాడు. చాలా కొత్త అంశాలతో రెండో పీఠిక కూర్చాడు. అందువల్ల ఇది పూర్వప్రతికి యథాతథ ముద్రణం కాదు. గుణం (క్వాలిటీ) పెరిగిన రెండో ముద్రణ. ఇదివరకటిలాగే ఆలోచనా పరులయిన తెలుగుపాఠకులు ఈ సరికొత్త రెండో ముద్రణ ప్రతిని సమాద రిస్తారని మాకు నమ్మకం.

—చేకూరి రామారావు

# వేమన పద్యాల నేపథ్యం

నిజానికి వేమన పద్యాలకు వ్యాఖ్యానం అవసరం లేదు. కాని సరళ సుందరమైన వేమన పద్యాల్లోకూడ ఆలోచిస్తేగాని తట్టని అర్థాలు బోలెడన్ని కనిపిస్తాయి. ఇప్పటికే వేమన పద్యాలకు చాలా వ్యాఖ్యానాలు వచ్చినా వేమన్న వేదననూ, అసమానతలమీద అంతులేని కోపాన్నీ, భావోద్వేగాన్నీ, వాటికి నేపథ్యంలో ఉన్న నాటి సంఘాన్నీ ప్రక్కకి నెట్టి చిలుక పలుకుల్లాగా వేమన్న కేవలం నీతిసూత్రాలు వల్లించాడన్నట్టుగా వెలసిన తాత్పర్యాలే ఎక్కువ. వీటిలోకూడ బ్రౌనే కొంత నయం. మూలంమీది గౌరవంతో ఎందరినో విచారించి, ఎంతో పరిశ్రమతో లఘు వ్యాఖ్యలతో సహా ఇంగ్లీషులోకి అనువదించాడు. కాని బ్రౌన్‌కు కూడ వేమన్న భాషా, తేటగా చెప్పే పద్ధతీ పట్టినంతగా వేమన భావాలూ, వాదాలూ పట్టలేదు. దీనికి బ్రౌన్‌ను తప్పుపట్ట నవసరం లేదు. ఆయనది ప్రధానంగా భాషాదృష్టి.

వేమన్నను అతని నాటి సామాజిక 'సన్నివేశంలో' చూడాలనే ఆలోచన మన కింకా సరిగ్గా కుదురుకోలేదు. వేమన పద్యాలు అప్పటి కాల పరిస్థితులకు ప్రతిస్పందనలుగా, ప్రతీఘాతాలుగా వెలువడ్డాయనే దృష్టితో చూస్తే వేమన పద్యాలు మనకు కొత్త వెలుగుల్లో కనిపిస్తాయి. అటువంటి ప్రయత్నంలో ఒక చిన్న ప్రారంభమే వేమన్నవాదం.

## II

హిందూమతంలోని లోపాలను దుయ్యబట్టిన వేమనను పట్టించుకున్నందుకు దేశీయ పండితులు నొచ్చుకున్నారని బ్రౌన్ వాపోయాడు. బ్రౌన్ తర్వాత 1914 దాకా అంటే దాదాపు ఒక శతాబ్దం దాకా వేమన్నను దేశీయ పండితు లెవరూ ఆదరదృక్కులతో చూడలేదు.

ఆధునిక కాలంలో కొమర్రాజు లక్ష్మణరావు, కట్టమంచి రామలింగా రెడ్డి వేమన్నమీదికి తెలుగుజాతి దృష్టిని మరల్చటంలో కృతకృత్యు లయ్యారు. వంగూరు సుబ్బారావు, వేటూరు ప్రభాకరశాస్త్రి, బండారు తమ్మయ్య, శేషాద్రి రమణకవులు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, నార్ల, ఆరుద్ర మొదలైనవారి కృషివల్ల వేమన్నపైన పరిశోధనకు దారులుపడ్డాయి.

దాదాపు 60 సంవత్సరాలుగా వేమన్న జీవిత కవిత్వాలను గురించి విపులమైన చర్చలు జరిగాయి. సాహిత్యవేత్తలు ఆయా సందర్భాల్లో వేమన్న కవిత్వాన్ని గూర్చి ప్రస్తావించటం, పద్యాలను ఉటంకించటం మొదలుపెట్టారు. అయితే పైన చెప్పిందంతా కేవలం శిష్టసాహిత్య ప్రపంచానికే పరిమితం. పండితులతో ప్రమేయం లేకుండా వేమనపద్యాలు ఊరూరా వాడావాడా సామాన్య ప్రజల నాలుకలమీద ఆడుతూనే ఉన్నాయి.

ఇప్పటివరకు వేమన్నపైన దాదాపు వెయ్యి అచ్చుపేజీల విమర్శన సారస్వతం వెలువడింది. వందలాది పద్య సంకలనాలు పీఠికల్తో అచ్చ య్యాయి. ఇంకా అచ్చవుతూనే ఉన్నాయి.

వేమన్న కాలాన్ని గురించి, స్థలాన్ని గురించి, బోధించిన తత్వాన్ని గురించి విస్తృతంగా చర్చలు జరిగాయి. వీరిలో వేమన్నను యోగిగా చిత్రించినవారు అధికం. కవిగా సమర్థించినవారు కూడ (అనంతకృష్ణశర్మ గారిని మినహాయిస్తే) పొగడ్తలు తప్ప కవిత్వ తత్వ నిరూపణకు పూనుకో లేదు. వేలాది వేమన పద్యాల్లో వేమనపద్యాలేవో కానివేవో అనే సమస్య ఇంకా అలాగే వుంది. వేమన చేసిన దురాచార ఖండనలపట్ల కూడ వీరికి కచ్చితమైన వైఖరిలేదు. తమకు నచ్చని విషయాలను వేమన్న ఖండించి నప్పుడు వేమన్నకు 'ఉద్రేక ప్రకృతి'ని అంటగట్టిన సందర్భాలున్నాయి.

చారిత్రకాధారాలు లేకున్నా వేమన్న జీవితాన్ని ఇష్టం వచ్చినట్టుగా ఊహించటంవల్ల వేమన్నను ఇంకోరకంగా చూడవచ్చుననే ఆలోచన దశాబ్దాల వరకు రాకుండా పోయింది.

వేమన్న కాలం గడిచి దాదాపు మూడు శతాబ్దాలు కావస్తున్నా వేమన పద్యాలను అధ్యయనం చెయ్యవలసిన దృష్టి మన కేర్పడలేదు. ఈ కాలానికి వేమన పద్యాలను అన్వయించుకుని వాడుకునే అభిరుచి కావాలి. ఉన్న అభిరుచులు వేమన్నకు వన్నెతెచ్చేవి కావు. మైనపు ముద్దల్లా ఒదిగే గుణముండడంవల్ల ఎవరికి నచ్చిన బొమ్మను వారు మలచుకున్నారు. వేమన్న సీరియస్‌గా చెప్పిన పద్యాలను "పరిహాస పూరితములు"గా కొట్టి పారేశారు.

వేశ్యాలోలుడిగా, యోగిగా, బ్రాహ్మణ ద్వేషిగా వేమన్నను చిత్రించే కొన్ని పద్యాలకు వ్యాఖ్యానాలు రాసి వేమన్న వ్యక్తిత్వ చిత్రాన్ని చీకాకు పరిచారు.

బ్రాహ్మణ పండితులు వేమన్నను కొంతకాలం నిశ్శబ్దపు పొరల కింద పాతేసారు కాబట్టి బ్రాహ్మణేతరులైనను వేమన్నను పైకెత్తరాదా అని వంగోలు వెంకటరంగయ్యలాంటి వాళ్ళు సలహా చెప్పారు.*

పంధొమ్మిదివందల ఇరవై, ముప్ఫైలలో రెడ్డిరాణి సంచికల్లో వేమన్నకు ప్రాధాన్యమిచ్చిన తీరు కులచైతన్యాన్ని జాగృతం చేయటానికి తోడ్పడిందేకాని వేమన్న బోధనలకు దానితో సంబంధం లేదు. వేమన్నను కులదృష్టితో చూస్తూ "వేమన రెడ్డు" అంటూ ఇంకా వ్యాసాలు వస్తున్నాయి. కులద్వేషంతో వేమన్నను ఉపేక్షించటం ఎంత తప్పో కులాభిమానంతో పైకెత్తటం కూడా అంతే తప్పు. వేమన పద్యాలు అందరివి, వేమన్న అందరికవి అన్న దృష్టే మన కేర్పడలేదు. పైగా కులాలే వద్దన్న వాడి కులం గురించి మాట్లాడటం శుద్ధ అనవసరం.

## III

వేమన పద్యాలను మొట్టమొదటిసారి అచ్చు కెక్కించిన ఘనత బ్రౌన్‌దే. 1829 లో మొదటి ముద్రణం, 1839 లో రెండవ ముద్రణం

---

* ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక 1923 దుందుభి ఆశ్వయుజ.

వేశాడు. తరువాత వందలాది సంకలనాలు వెలువడ్డాయి. వెలువరించిన వారిలో కొందరు వాటిని పరిష్కరించివేశామని చెప్పుకున్నారు. పరిష్కరించటమంటే 'దిద్దటమే'.

అల్లిబిల్లిగా అల్లుకుపోయిన వేమన పద్యాలను మొదటిసారి విభాగించింది కూడ బ్రౌనే. కాని ఈ విభాగాల పద్ధతికి తాటాకు ప్రతుల్లోనే అంకురార్పణ జరిగిందని చెప్పవచ్చు.†

బ్రౌను దగ్గరి నుంచి ఇప్పటివరకు వచ్చిన అన్ని విభాగాలు కూడా సౌకర్యం కోసమే చేసినవే కాని సామాజిక సన్నివేశదృష్టితో చేసినవి కాదు. వేమన పద్యాలను మొట్టమొదటిసారి 'అది భౌతికవాద' నేపథ్యంతో చూసినవారు ఆరుద్ర. వారి వేమన్న వేదం ఈ మార్గానికి ఒరవడి పెట్టింది.

ప్రత్యేకంగా ఊరు చెప్పటం కష్టంకాని వేమన్న రాయలసీమవాడని చెప్పటానికి ఆయన పద్యాల్లోనే సాక్ష్యాలున్నాయి. పదజాలం, ఆ ప్రాంతానికే పరిమితమైన కొన్ని పరిస్థితులు దానిని నిర్ధారిస్తాయి.

అబేదుబాయ్ నుంచి ఆరుద్రదాకా చాలామంది వేమన్నను 17వ శతాబ్దపు కవిగా భావించారు. సుమారు 1650 ప్రాంతం వాడుగా నిర్ధారించటానికి ఆధారాలున్నాయి.*

## IV

వేమనపద్యాల పాఠ నిర్ణయానికి అచ్చయిన ప్రతులమీద ఆధారపడకుండా కొన్ని మూలతాటాకు ప్రతులను సంప్రతించాను. బ్రౌన్ చూచిన తాటాకు ప్రతులు‡ తంజావూరు సరస్వతీ మహల్, కాకినాడ ఆంధ్ర

† కాకినాడలోని 185/9 నంబరు ప్రతిలో, విరక్తి పద్యాలు, వేమయగారు చెప్పిన లోకరీతి అని రెండు విభాగా లున్నాయి.

* కాలాన్ని గురించి విపులమైన చర్చ 'ప్రజాకవి వేమన' అనే నా సిద్ధాంత వ్యాసంలో ఉంది.

‡ ఇవి ప్రస్తుతం తిరుపతి ఓరియంటల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్‌లో ఉన్నాయి.

సారస్వత పరిషత్తు లైబ్రరీలోని ప్రతులు ఇందులో ప్రధానమైనవి. నా పరిశోధన కోసం సేకరించగా మూడు వేల పద్యాలకు సుమారు పదిహేను వేల పాఠాంతరాలు దొరికినాయి.

ఈ అపార పద్య సంచయంలో వేమన పద్యాలేవో కనిపెట్టటానికి నేను కొన్ని ప్రమాణాలను ఏర్పరచుకున్నాను. 1. తాటాకు ప్రతు లన్నింటి లోని పద్యాలను సరిపోల్చి చూస్తే ప్రతి ప్రతిలో సామాన్యంగా వుండే పద్యాలు 100 దాకా తేలుతాయి.‡ అవి ప్రజల నోటికెక్కిన ప్రసిద్ధ పద్యాలు. మన కలవాటైన వేమన్న శైలితో వుంటాయి. వాటి ఆధారం కొంత. 2. నాకు లభించిన ప్రతుల్లో ప్రాచీన ప్రతి ఆధారం కొంత (24 ఏప్రిల్ 1691). 3. కందాది పద్యాలశైలి వేమన్న ఆటవెలదులకు భిన్నం. రెండూ ఒకే కవి చెప్పాడని నమ్మటం కష్టం. ఈ చర్చల వెలుగు కొంత.

# V

వేమన పద్యాల కొక సామాజిక నేపథ్యాన్ని ఏర్పరచటం ఈ పీఠిక ధ్యేయం. అందుకే 17వ శతాబ్దంనాటి రాజకీయాది పరిస్థితులను కొంత సుదీర్ఘంగా చెప్పటం జరిగింది. వేమన్న వాదంలోని పద్యాలకే కాక మిగిలిన వేలాది వేమన పద్యాలకు కూడ ఇది నేపథ్యంగా వుపకరిస్తుందనే వుద్దేశంవల్ల అలా చేశాను. ఎక్కడి కక్కడ వేమన పద్యాలకు వెనక వున్న సన్నివేశాన్ని సాక్షాత్కరించుకునే ప్రయత్నం ఈ రూపాన్ని సంతరించుకుంది.

వర్ణవ్యవస్థ, గ్రామవ్యవస్థ విచ్ఛిత్తిని గురించి వ్యాఖ్యానంలో ప్రసక్తులుగా అక్కడక్కడ వచ్చాయి కాబట్టి ఇక్కడ ప్రత్యేకంగా రాయటంలేదు. అప్పటి పరిస్థితులకు ప్రతిస్పందనలుగా వెలువడ్డ అనేకానేక వేమన పద్యాలను కూడ ఈ కారణంవల్లనే ఉటంకించలేదు.

‡ బ్రౌనే మొదట ఈ పని చేశాడు. తనకు 40 పద్యాలు తేలాయని చెప్తూ తున్నాడు.

వేమన్నను చెప్పుకోదగిన కవిగాదని చప్పరించేవాళ్ళు యింకా వున్నారు. శతాబ్దాల కిందట ఏదో ఒక భాషలో ఏర్పరచిన కొన్ని రచనా సూత్రాలను సర్వకాల సర్వసాహిత్యాలకు వర్తించా లనుకునే వాళ్ళకు ఇవాళ ప్రత్యేకంగా సమాధానం చెప్పటం అనవసరం. ఆ సూత్రాలైనా ఏకవాక్యత వున్నవి కావని గుర్తుంచుకోవాలి మనం.

పేదరికాన్ని చూసి వేమన చలించిపోయినట్టు ఆయన పద్యాల్ని బట్టి మనం గ్రహించగలం. ధనవంతులు తమ సంపదని పేదవారికి పంచితే పేదరికాన్ని తొలగించవచ్చునని వేమన్న భావించినట్టు కనిపిస్తుంది. ఈనాటికీ ఇట్లాంటి భ్రమలున్నవాళ్ళు రాజకీయ నాయకుల్లోనే వున్నారు. పేదరికానికి మూలకారణం ఆర్థిక వ్యవస్థలోని దోపిడీ విధానం అని వేమన గుర్తించనందుకు మనం తప్పుపట్టకూడదు. వేమన ప్రధానంగా తాత్వికుడైన కవి. సామాజిక దృష్టి ప్రధానంగా వున్న, పదునైన పరిశీలన వున్న కవి కావటంవల్ల సమకాలికు లెవరూ చూడనంత లోతుగా సంఘాన్ని పరిశీలించాడు. అయితే ఆ చూపుకైనా కొన్ని పరిమితులుండక తప్పదు.

# VI

## రాజకీయ సంక్షోభం

మనకు దొరికినవి చరిత్ర శకలాలేకాని సమగ్ర చరిత్ర కాదు. స్థానిక చరిత్రల మీద దృష్టి సారిస్తే తప్ప చరిత్ర నిర్మాణానికి దారులు పడవు. పల్లెల, జిల్లాల చరిత్రలు తవ్వి పోసిననాడు అనేక ప్రశ్నార్థకాల చిక్కులు వాటంతట అవే విడిపోతాయి. అప్పటిదాకా అదనుదొరికితే అల్లుకుపోయే సిద్ధాంతాలు తప్ప గత్యంతరం లేదు.

మన దేశచరిత్రలో 17వ శతాబ్దం మరీ అంధకారయుగం. యుద్ధోన్ముఖ పరిపాలన. ఈ కాలంలోని రాయలసీమ పటం త్వరత్వరిత పరిణామంగా వుంది. అయితే అప్పటి రాజకీయ సంక్షోభాన్ని రేఖాప్రాయంగా లభిస్తున్న వివరాలవల్ల కొంత తెలుసుకోవచ్చు.

ఆంధ్రుల చరిత్రలో మునుపెన్నడూ లేనంత సుదీర్ఘ కాలం నిలకడగా చెలరేగిన రాజకీయ అస్థిరత 16 వ శతాబ్దంలో మొదలైంది. 19 వ శతాబ్దం దాకా ఆ మంటలు చల్లారలేదు. విజయనగర సామ్రాజ్య పతనంతో దక్షిణ దేశ చరిత్రలో సమూలమైన మార్పులు మొదలైనాయి. 1565 లో విజయ రామరాయలకు బహమనీ సుల్తానులకూ మధ్య జరిగిన తల్లికోట యుద్ధంలో హిందూ సామ్రాజ్యం చాలా దెబ్బతిన్నది. మరో నూరు సంవత్సరాల వరకు విజయనగర సామ్రాజ్యం కొనసాగినా దానిలో వెనకటి స్థైర్యం లేదు. ఆత్మరక్షణలోనే ఆ నూరేండ్లు గడిచాయి. మహమ్మదీయ రాచరికం వేరూని క్రమంగా దక్షిణాదిని విస్తరిస్తున్నది.

రామరాయలు బహమనీ సుల్తానులతో చేసిన యుద్ధాలుగాని, స్నేహాలు కాని రాజనీతికోసం, విస్తరణ కాంక్షతో చేసినవే. అయితే ఆదిల్‌షా పక్షాన నిజాంషాకు వ్యతిరేకంగా జరిగిన యుద్ధంలో కళ్యాణదుర్గంలో రామరాయల సైనికులు మతపరమైన అత్యాచారాలు చేశారు. ఈచర్య అంతవరకు తమలో తాము కలహించుకుంటున్న మహమ్మదీయ రాజులలో మతపరమైన జాగృతిని కలిగించింది. ఈ విషబీజం ప్రభావం ఈ శతాబ్ద మంతటా పరచుకుంది.

రామరాజు మరణం తర్వాత బీజపూర్, గోల్కొండ నవాబు విజయ నగర రాజ్యంలోని అనేక ప్రాంతాల నాక్రమించారు. 1570 లో విజయ నగరం మూడు ముక్కలైంది. ఆ మూడు ముక్కలకు ముగ్గురు రాజులు.

1. శ్రీరంగరాయలు : పెనుగొండ రాజధానిగా తెలుగు ప్రాంతం.
2. రామరాయలు : శ్రీరంగపట్టణం రాజధానిగా కన్నడ ప్రాంతం.
3. వెంకటపతిరాయలు : చంద్రగిరి రాజధానిగా ద్రావిడ ప్రాంతం.

క్రమంగా మొదటి రెండు నశించాయి. మిగిలింది వెంక

రాయలు. చంద్రగిరి రాజధానిగా ఏర్పడిన ఇతని రాజ్యంలో తమిళ ప్రాంతం రాయలసీమలు వున్నాయి.

వెంకటపతిరాయల కాలంనుంచే బహుశ మనకు కావలసిన కాలం మొదలైందని చెప్పవచ్చు. వేమన్న వెంకటపతిరాయల కాలానికి కొంచెం తర్వాత జీవించి వున్నాడని చెప్పవచ్చు. వెంకటపతిరాయలు 28 ఏండ్లు (1586-1614) రాజ్యం చేశాడు. 1614 లో అతడు మరణించే వరకు ద్రావిడ, రాయలసీమ ప్రాంతాలు మహమ్మదీయుల చేతికి చిక్కలేదు. అతని మరణాంతరం కూడ 32 ఏండ్లదాకా విజయనగర సామ్రాజ్య శేషం కొన ఊపిరులతో పెనుగులాడుతూనే వుంది. 1675 నాటికి విజయనగరం పూర్తిగా నశించిపోయింది. 1646 నుంచి 1675 దాకా ద్రావిడ, రాయల సీమ, ప్రాంతాలు భయంకరమైన రాజకీయ సంక్షోభంలో పడిపోయాయి. స్థానిక ప్రభువుల అంతఃకలహాలతో, పరరాజుల పదఘట్టనల్తో ఈ కాల మంతా కల్లోలంగా వుంది. 1675 నుంచి 1800 దాకా రాయలసీమ ప్రాంతం స్థానిక నవాబులు, పాళెయగార్ల అధీనంలో వుంది. పక్కనే వున్న మధుర, తంజావూర్లు కూడ ఇలాగే వున్నాయి. విజయనగర పతనానికి మధుర రాజులు కొంత దోహదం చేశారు. తొందరలోనే మధురమండలం మహమ్మదీయుల చేతిలోకి వచ్చింది. చంద్రగిరిలో వెంకటపతిరాయలు మరణించిన సంవత్సరమే (1614) తంజావూరులో రఘునాధరాయలు రాజ్యానికి వచ్చాడు. 1633 లో రఘునాధుని కొడుకు వచ్చాడు. ఇతడు సమర్థుడు కాదు. ఇతనికి రాజకీయంగా చెడ్డపేరుంది. గోళ్ళూడగొట్టి పన్నులు వసూలు చేసే వాడట. 1662 లో భయంకరమైన కరువు వచ్చింది. ఇతనికి మతసహనం కూడ లేదు. వీరవైష్ణవుడై ఇతర మతాలవారిని బాధించాడు. 1675 ప్రాంతంలో మహారాష్ట్ర ప్రభువైన శివాజీ సోదరుడు వెంకోజీ తంజావూరును ఆక్రమించాడు. ఇదేకాలంలో గోలకొండను అబ్దుల్‌హసన్ కుతుబ్‌షా (1658-1687) పాలిస్తున్నాడు. ఇతనికంటె ముందువాడైన తానీషా కాలంలోనే ఇంగ్లీషువారు ఆక్రయింపులు మొదలుపెట్టారు.

1687 లో గోలకొండపై ఔరంగజేబు దండెత్తాడు. 1687 లో గోలకొండ నశించింది.

గోలకొండను జయించిన తరువాత ఔరంగజేబు 20 ఏండ్లు జీవించాడు. గోల్కొండను సాధించాడు కాని ఆ పరగణాలో శాంతిని స్థాపించలేకపోయాడు. గతంలోని అనేక యుద్ధాల ఫలితంగా రాజుకుంటున్న సంక్షోభ జ్వాలలు ఈ కాలంలో తారస్థాయిని అంటుకున్నాయి. గోల్కొండలోని సామంతులు, చిల్లర రాజులు, జమీందారులు ప్రభుత్వంమీద తిరుగుబాటు చేశారు. కాలం కల్లోలమైంది.

తర్వాత నిజాం రాజ్యమేర్పడి జమిందారులను మిగిల్చి అది కూడా అంతరించిన దశలో బ్రిటిషు సామ్రాజ్యం పూర్తిగా నిలదొక్కుకుంది.

రాయలసీమ 1799 దాకా నిజాం చేతికి చిక్కలేదు. అదికూడా టిప్పుసుల్తాన్ మరణాంతరమే సాధ్యమైంది. బ్రిటిషువారు ఆంధ్ర భూభాగంపైన 1611 లోనే అడుగుపెట్టినా సుమారు 200 ఏండ్ల తర్వాతనే వారికి ఆంధ్రదేశమంతా స్వాధీనమయింది. విజయనగర వినాశనంతో ఆంధ్రదేశంలో ప్రారంభమైన రాజకీయ సంక్షోభం బ్రిటిషువారి సుస్థిర సామ్రాజ్య స్థాపనతోనే అంతమైంది.

ఈ కాలంలో కేంద్రరాజులు ఎవరున్నా ప్రజలకు ప్రత్యక్ష సంబంధమున్నది స్థానిక పాలకుల్తోనే. విజయనగరరాజుల సామంతులు, పాళెయగార్లు, తర్వాత|ఛోటానవాబులు మొదలైన చిల్లరరాజులు అధికారం నెరిపారు. 17 వ శతాబ్దంలోనే కడప గోల్కొండ నవాబుల వశమైంది. దానికి నేక్నామ్ ఖాన్ అనేవాడు సైనికాధికారి. 1687 లో ఔరంగజేబు పట్టుకున్నాడు. మీర్‌జుమ్లా అనేవాడు గండికోట మొదటినవాబు. ఇతని తర్వాత రెండవ నబీఖాన్ అనేవాడు గండికోటలో, గుర్రంకొండలో సైనికకేంద్రాలు ఏర్పరచి స్థిరసైన్యాన్ని పోషించాడు. ఈ నవాబు లెవరూ గ్రామాల్లో చెలరేగిన పాలెగార్ల నణచలేకపోయారు. రాజ్యంలో శాంతిని స్థాపించటం

వీళ్ళకి చాతకాలేదు. 1687 లో ఔరంగజేబు దక్కనును జయించటం వల్ల అనంతపురం తాలూకా దక్కను సుబేదారు పాలన కిందికి వచ్చింది. చిత్తూరుజిల్లా 1646 లోనే గోలకొండ నవాబుల వశమైంది. గోల్కొండ నవాబుల కింద కడప నవాబు మదనపల్లి, వాయల్పాడు, పుంగనూరు తాలూకాలను పాలించగా మిగతావాటిని ఆర్కాటు నవాబు పాలించాడు. నెల్లూరు కూడా గోల్కొండ పతనానంతరం ఆర్కాటు నవాబుల వశమైంది.

గమనించవలసిందేమిటంటే ఈ నవాబులంతా దుర్గాధిపతులు. వీరికి వారి పాలన ముఖ్యం. తాలూకా, గ్రామస్థాయిలలోని చిన్న పాలకులు ఎక్కువగా స్థానికులే. ముఖ్యంగా పాళెగాళ్లు. ఈ నవాబుల్లో మతంజోలికి పోని మంచివాళ్ళు కూడ వున్నారు. కాని గ్రామాల్లో జరిగే చిల్లర అధికారుల, భూస్వాముల ఆగడాలను వీళ్ళు అరికట్టలేకపోయారు. సమయం చిక్కినప్పుడు పాళెగాళ్లు బందిపోట్లలాగా పక్క ఊళ్ళను దోచుకునేవారు. 1746 లో మహారాష్ట్ర సేనాని మురారిరావు అనేవాడు గుత్తి, తాడిపత్రి, పెనుగొండ ప్రాంతాలను స్వాధీనం చేసుకొని పాళెగాళ్లను కొంత అణచాడని చెప్తారు.

ఇట్లాంటి కాలంలో ప్రజలకు భద్రత కరువైంది. ఇల్లాంటి రక్షణ లేని కాలమే వేమన పద్యాల్లో కనిపిస్తుంది. అయితే ఇవి పదుల సంఖ్యను మించవు. స్వభావాన్నిబట్టి వేమన్న మూడురకాల రాజులను గూర్చి చెప్పాడు.

1. పిరికిపందలు
2. దుర్మార్గులు
3. అజ్ఞానులు

వేమన్న మాటల్లో వీళ్ళు ప్రజలకు 'పట్టుగొమ్మలు' కాదు. 'పెట్టిపొయ్యలేక తిట్టే' దేబెలు. వీళ్ళు పరరాజులు దండయాత్ర కొస్తున్నారంటే కాళ్ళకు బుద్ధి చెప్తారు. "పిరికి బంటుకేల బిరుదు గొడుగు" అంటాడు ఓ

చోట. వీళ్ళు 'తరచు కల్లలాడు ధరణీశులు.' వేమన్న ప్రకారం 'భూపతి కృపలు' 'రాచమూకల'ను నమ్మకూడదు. 'అల్పబుద్ధివానికి' అధికారం ఉండరాదు. "వెర్రిగొల్వరాదు విభుడెంతవాడైన" అని హెచ్చరిస్తాడు. వేమన్నగూర్చి L. D BARNETT ఇలా రాశాడు :

"He had no great reverence for a jack in office. Perhaps he had in view some local Dogiberry when wrote."*

## మతాల శిథిల సంధ్య

హిందూమత జీవనంలో ఒకటి రెండు శతాబ్దాలు, గుర్తుపట్టలేని పెద్ద మార్పులు తెచ్చేటంతటి దీర్ఘకాలం కాదు. నాటి రాజుల వైభవం, ప్రజల విశ్వాసాలు, సుఖదుఃఖాలు, విద్వేషాలను గూర్చి నేటి శిథిలావశేషాలు కొంత చెప్తాయి. 17 వ శతాబ్దంనాటి మత స్థితిగతులను గాఢంగా ప్రకటించే సాధనాలు కనపడవు. పాశ్చాత్యుల యాత్రాచరిత్రలు, కొన్ని ఇతర గ్రంథాల్లో శకలాలుగానే అప్పటి మతచరిత్ర లభిస్తుంది. వీటిలో 19 వ శతాబ్దం (1792-1823) తొలిరోజుల్లో మద్రాసు ప్రాంతంలో జీవించిన ఫ్రెంచి మతగురువు అబెదుబాయ్ రచించిన 'హిందువుల ఆచారాలు - పండుగలు' అనే గ్రంథం ముఖ్యమైంది. ఈ పరాసుఫాదరీ వర్ణించిన మత పరిస్థితులు 17 వ శతాబ్దంనాటి మతపరిస్థితులకు ఏ మాత్రం భిన్నమైనవి కావు. ఒకవేళ కించిద్భేదం కనిపించినా అది పరిణామంలో తరువాతిదశ కావచ్చునేమోకాని, రెండు కాలాలను వేరుచేసేంత భేదం లేదు.

మతం, సంప్రదాయం, ధర్మం అనే ఈ మూడు Religion అనే పదానికి సమానార్థకంగా వ్యవహరించబడుతున్నాయి. మతం మానవుని నిత్యజీవిత కృత్యాలనుంచి విముక్తిని కోరుతుంది. అన్ని మతాలు సామాన్య జీవితం నుంచి ఏదో రకమైన ముక్తిని అంగీకరించాయి. ఆ ముక్తి స్వరూ

* (— Teacher and Preacher P. 70 Vemana through western eyes)

పాన్ని అర్థంచేసుకోవటంలో భావించటంలో, అనుభవించటంలో ఉన్న భేదాలనుబట్టి దీనిని సాధించటంకోసం అనుసరించవలసిన మార్గాల్లో భేదాలు ఏర్పడ్డాయి.

బ్రహ్మం ఒక్కడే నిజం. మిగిలినవన్నీ మిథ్య. మాయవల్ల అన్నీ వేరు వేరుగా కనిపిస్తున్నాయి. అంతా ఒక్కడే అని తెలుసుకోవటం ముక్తి అని అద్వైత సిద్ధాంతం చెప్తుంది, లేదు లేదు! జీవాత్మకు ప్రత్యేక వ్యక్తిత్వముందని మనిషి దేవుడు వేరని చెప్పేది ద్వైతం. ఈ ధోరణి లోనే కొన్ని భేదాలతో, సవరణలతో ఇతర మతతత్వాలు ఏర్పడ్డాయి. అయితే తాత్త్వికంగానేకాక ఇతర కారణాల్తో మతాలన్నీ ఘర్షణపడ్డాయి! ఆయా మతాలను ఏదోరకంగా సమర్థించుకోడానికి తర్కాలు నేర్ప బడ్డాయి.

## కల్ల గురువులు *

ఈ గంభీర చర్చలకు దూరంగా ఉన్న ప్రజలను గురువులు తమ స్వార్థాలకు అనుకూలంగా వ్యాఖ్యానాలు చెప్పి, వారిలో మూఢత్వాన్ని పెంచి మోసం చేసేవారు. పారిభాషిక పదాలతో హడలగొట్టేవారు! సమకాలం లోని మత సంబంధమైన కట్టుబాట్లను రక్షించటం తమ కర్తవ్యంగా భావిం చారు. కులం నుంచి బహిష్కరించటం వంటి శిక్షలు అమలు జరిపేవారు. వారి ఆశీస్సులు లేకుంటే పాపాలు పోవని చెప్పేవారు. వారిచేత 'ప్రసాదం' పొందటమే మహాభాగ్యం! విభూది, పూజాపుష్పాలు, వారి ఎంగిలికూడు,

* ఈ మతపరిస్థితుల భాగం రాయటానికి అబేదుబాయ్ (1817) అనే ఫ్రెంచి మిషనరీ రాసిన "Hindu manners' customs and ceremonies" అనే గ్రంథంపై ఆధారపడ్డాను. దుబాయ్ ఈ గ్రంథాన్ని తనకన్న పూర్వుడైన ఓ మత ప్రచారకుని అముద్రితగ్రంథంనుంచి గ్రంథచౌర్యం చేశాడనే నిజం ఇటీవలి ఇంగ్లీషు పరిశోధనలో వెల్లడయింది. అయితే ఇందులోని విషయాన్ని వాడుకోటానికి ఇదేమీ అడ్డురాదు.

వారు పుక్కిలించిన లేక ముఖం, కాళ్ళుచేతులు కడుక్కున్న నీరు (ఈ నీరు తీర్థంగా పుచ్చుకొని తరచుగా తాగేవారు) ఒకటేమిటి వారి పవిత్ర హస్తాలతో ఏది ఇచ్చినా ప్రజల దేహాత్మలోని కల్మషాలు క్షాళితమౌతాయని నమ్మించారు. సామాన్యప్రజలు వీరిని భయగౌరవాల్తో సేవించారు. న్యాయమైనా, అన్యాయమైనా గురువులు శపిస్తే 'నాశనమైపోతామని' వారు విశ్వసించేవారు. ప్రజల మూఢత్వాన్ని పెంచే అభూత కల్పనలను, గురువుల మహిమలను, ఆ గురువుల చుట్టూ ఉండే శిష్యులు ప్రచారం చేసేవారు. మూఢులైన ప్రజలు నిజంగానే వాటిని నమ్మి గురువుల అడుగులకు మడుగులొత్తేవారు. గురువులు కోరిన కానుకలను అర్పించటానికి పెళ్లాంబిడ్డలను తెగనమ్మటానికైనా సిద్ధపడేవారు కాని గురువులను నొప్పించి శాపోపహతులు కావటానికి ఎవ్వరూ సాహసించేవారు కారు.

ఈ గురువులు రాజులతోపాటు యుద్ధభూములకుపోయి విజయం కొరకు మంత్రాలు చదివి ఆశీర్వదించేవారు. గురువులకు ప్రజలపై వున్న ప్రభావం, పలుకుబడి వల్ల రాజులు కూడ వీరిని అమితంగా గౌరవించేవారు.

'గురుదక్షిణ' మొదలైన పేర్లతో వీరు ప్రజలనుంచి అనేక రకాలైన పన్నులు వసూలు చేసేవారు. ప్రజలు భక్తితో ఇచ్చేకానుకల్తో వీరెప్పుడూ తృప్తిపడేవారు కారు. కట్టుబాట్లు తప్పినవారినుంచి వీరు ధనం వసూలుచేసే పద్ధతి నిర్దయగా ఉండేది. ఇవ్వలేని వాని ముఖాన పేడనీరు చల్లి అవమానించేవారు. అప్పటికీ వాడు చెల్లించలేకపోతే వాడి పిల్లల్ని లాక్కునేవారు. ధనం ముట్టేదాకా వారితో వెట్టిచాకిరీ చేయించుకునేవారు. ఒకప్పుడు ధనానికి బదులుగా వాడి భార్యను లాక్కుపోయిన సంఘటనలు కూడా ఉండేవి. చివరి అస్త్రంగా శాపాలతో బెదిరించేవారు. ఎవరో కొందరు వివాహితులైనప్పటికీ గురువులలో అధికులు బ్రహ్మచారులే. తరచుగా వీరి బ్రహ్మచర్యం నేతిబీరకాయ వంటిదిగానే ఉండేది. వీరెప్పుడూ ఒకరిద్దరు

స్త్రీలను వంటలక్కలుగానే నియమించుకునేవారు. సామాన్యులకు విధించే కట్టుబాట్లు తమకు వర్తించనట్టుగానే ప్రవర్తించేవారు. ప్రజలు గురువులను లోలోపల అసహ్యించుకొనేవారు. సరిగ్గా ఈ అసహ్యమే వందలాది వేమన పద్యాల్లో వ్యక్తమైంది.

## శైవ వైష్ణవాల సంఘర్షణ

వేమన శైవులను వైష్ణవులను సమానంగా తిట్టాడు. తత్త్వాలు అటుంచి నిత్యజీవితంలో వీళ్ళ ఆగడాలను, వేషధారితనాన్ని వేమన్న దుయ్యబట్టాడు. వేమన్న చేసిన అధిక్షేపాల వెనక ఎటువంటి పరిస్థితు లుండేవో తెలిస్తే వేమన్న ఆగ్రహం మనకు అర్థమౌతుంది.

శైవవైష్ణవులను వారు ధరించే చిహ్నాలను బట్టి లింగధారులనీ నామ ధారులనీ పిలిచేవారు. విష్ణుభక్తునికి దాసరి, రమణయోగి, బైరాగి అనే పేర్లు వాడుకలో వుండేవి. శివయోగిని కూడా బైరాగి అనేవారు. వైష్ణవులు పీతాంబరధారులు. తలపాగలు, భుజంమీద పులితోలు, మెడలో రుద్రాక్ష మాలతో వారివేషం ప్రత్యేకంగా వుండేది. వీరు భిక్షకు బయల్దేరినప్పుడు చేతిలో కంచుగంట, శంఖాలుండేవి. బిచ్చానికి బయల్దేరుతూ వారు తమ రాకను తెలియజేస్తూ శంఖులూదేవారు. గంటమోగించేవారు. వారిమెడలో ఒక వెండిరేకుపలక వేలాడుతుండేది. దానిపైన హనుమంతుని రూపంగాని విష్ణువు దశావతారాలుగాని చెక్కి వుండేవి. కొంతమందికి భుజాలనుంచి పాదాలవరకు చిరుగంటలుండేవి. ఆ చిరు గంటల మోతలు గృహస్థులకు వారి రాకను తెలియజేసేవి. వీటన్నిటికి తోడు కొందరికి భుజాలపైన రెండు కొనలు పదునుగా వుండే ఈటెలవంటివి వుండేవి. వీటి చివరలకు వేలాడే గిన్నెల్లో యజ్ఞాలు చేసిన వీబూది వుండేది. వీరు భిక్షావృత్తిని తమ హక్కుగా భావించేవారు. తీర్థయాత్రాస్థలాల్లో వీరికి ప్రత్యేక సౌకర్యాలుండేవి. అటు వంటి స్థలాల్లో వీరు వేల సంఖ్యలో ఒకచోట కనిపించేవారు. వీరు చిన్న చిన్న గుంపులుగా విడిపోయి ఊళ్లమీద పడేవారు. తీర్థ యాత్రలకు వెళ్ళే

టప్పుడు దారిలో తటస్థించిన గ్రామాల ప్రజలే వీరి తిండి వసతి మొదలైన అవసరాలు తీర్చేవారు. వీరు గుంపులుగానే తప్ప సాధారణంగా ఒంటరిగా ప్రయాణించరు. వీరు భిక్ష అడగటం కూడ యాచన కంఠంతో కాక బెదిరింపు ధోరణిలోనే వుండేది. వీరికి బిచ్చం వేయటంలో ఏ మాత్రం జాప్యం జరిగినా కోపంతో గంటలు మోగిస్తూ శంఖానాదం చేస్తూ తమ అసహనాన్ని తెలియజేస్తారు. వాటికి కూడ జవాబు రాకపోతే కొందరు ఇంట్లో ప్రవేశించి వస్తువులను పగులగొట్టి, ఇంటి సామానులను నానా భీభత్సం చేస్తారు. వీరు బిచ్చమడిగేటప్పుడు పదాలు పాడుతూ నర్తిస్తారు. సామాన్యంగా వారి పాటలు విష్ణుపరమైనవే. తరచుగా అశ్లీల గీతాలు పాడగా విన్నానని అబేదుబాయి వ్రాశాడు. ఇవి ప్రజలనుంచి భిక్షలను ఆక ర్షించటానికేనని అతడు అభిప్రాయపడ్డాడు. ఇటువంటి దురుసు ప్రవర్తన వల్లనే వైష్ణవేతర వర్గాలు వీరిని అసహ్యించుకునేవి.

వైష్ణవ భిక్షుకులు మధుసేవనం మాంసభోజనం చేసేవారు. గంజాయి వంటి మత్తుపదార్థాలకు లోనయ్యేవారు. శైవుల్లో వున్న శక్తిపూజ వీరిలో కూడ కనిపించేది. వానరము, గరుడము, సర్పము వీరికి చాలా గౌరవప్రద మైనవి. వీటిని ఎవరైనా వీరి కళ్ళ ఎదుట గాయపరచటం కాని, చంపటం గాని చేస్తే సహించేవారుకాదు. దానిని తీవ్రమయిన నేరంగా పరిగణించే వారు. ఆ నేరం చేసినవాడి ఇంటిముందు వేల సంఖ్యలో మూగిపోయి వాడి నుంచి పెద్ద మొత్తంలో జరిమానాలుగా వసూలు చేసేవారు. ఈ తతంగ మంతా అతి దారుణంగా జరిగేది. ఆ ధనంతో తర్వాత ఘనమైన విందు జరుపుకునేవారు. ఇక శైవులు, వీరశైవులు దక్షిణంలో అన్ని ప్రాంతా ల్లోను కనబడతారు. వీరు వైదిక కర్మకాండను నిరసిస్తారు. పునర్జన్మ సిద్ధాంతంలో విశ్వాసం లేదు. లింగం అందరిని సమాన పరుస్తుందని నమ్మిన వారు కావున కులభేదాలను నిరాకరించారు. అస్పృశ్యుడు కూడ వీరశైవుల దృష్టిలో బ్రాహ్మణునికన్నా తక్కువ వాడేమీ కాదు. వీరు వైదిక బ్రాహ్మణ

ంలు కాబట్టి బ్రాహ్మణుల అసహనానికి గురైనారు. వీరశైవులలో అనేకులు భిక్షావృత్తిలో జీవించేవారు. భూములు మొదలైన ఆస్తిపాస్తులున్న వారు తమ ఆదాయాన్ని మఠాల నిర్వహణకు, శివకైంకర్యానికి ఖర్చు పెట్టేవారు. శైవ గురువుల్లో కూడ బోలెడన్ని దురాచారాలుండేవి.

శైవ వైష్ణవుల్లో బ్రాహ్మణేతరులు అధికంగా, అస్పృశ్యులు, చర్మకారులవంటివారు అత్యధికంగా చేరేవారు. శైవం స్వీకరించగానే మధుమాంసాదులు విసర్జించాలి. కాని వాటికి గాఢంగా అలవాటుపడ్డ చిన్న కులాలవారికి అది కష్టంగా వుండేది. కాబట్టి శూద్రులలో కొంత భాగము అస్పృశ్యులు మొదలైనవారు వీటిని యథేచ్ఛగా ఉల్లంఘించేవారు. మతాలను ముఖ్యంగా తమ బలహీనతలకు అనుకూలంగా వుండే మతాలలోనికి మారిపోవటం అధికంగా జరిగేది. ప్రజలు వీరిని హేళనగా చూసేవారు. ఈ హేళన అనేకానేక వేమన పద్యాల్లో వ్యక్తమయింది.

పెద్ద ఆటంకాలు కల్పించకనే ఎదుటిమతంవాడిని తమ మతంలోనికి చేర్చుకునేవారు. భార్య శైవురాలు, భర్త వైష్ణవుడుగా వున్న కుటుంబాలు కూడ వుండేవి. రెండు మతాలవారి అభిమానాన్ని పొందటానికి ఇదొక యుక్తి కావచ్చును.

వైష్ణవులు నిత్యవ్యవహారంలో కూడ తరచుగా విష్ణుపారమ్యాన్ని ఉద్ఘాటించేవారు. శివుని జన్మకు, స్థితికి కూడ అతడే హేతువు. అనేక పరిస్థితుల్లో శివుణ్ణి విష్ణువే ఆదుకోకపోతే అతడు ఎప్పుడో నశించి ఉండేవాడు, ఏ విధంగా చూపినా శివుడు విష్ణువుతో తూలతూగలేడని వాదించేవారు.

ఇక శైవుల దృష్టిలో విష్ణువు చేసినవన్నీ అకార్యాలే. శివుడే సకలారాధ్యుడు. లింగధారణం అసహ్యకరమని వైష్ణవులు భావిస్తే, నామధారులైన వైష్ణవులు నరకంలో అదే ఆకారంలో వున్న శూలాలతో గుచ్చబడతారని శైవులు ప్రచారం చేసేవారు. వీరి పరస్పర దూషణలు తరచుగా

హింసాత్మకమయిన కలహాలతో ముగిసేవి. ఒక గుంపు తమ దైవపార మ్యాన్ని ఉద్ఘాటిస్తూ పరదైవదూషణకు పాల్పడేది. వెంటనే పరస్పర దైవదూషణలతో, శాపనార్థాలతో ముష్టిఘాతాలకు దిగేవారు, రక్తపాతం కూడ జరిగేది. ఒకరి తలపాగను మరొకరు లాగివేయటం, బట్టలు చింపు కోవటంతోనే ఇదెక్కువగా ముగిసేది.

ఇటువంటి మతోన్మాదుల మూలంగా అలజడులు రెచ్చిపోగానే రాజులు వీటిని తమ రాజకీయ ప్రయోజనాలకు ఉపయోగించుకునేవారు. వీలును బట్టి ఆయా మతాలను స్వీకరించేవారు.

## బసివిరాండ్రు

ప్రాచీన కాలంనుంచి పెళ్ళికాని ఆడపిల్లలను దేవాలయములలో సేవకొరకు మొక్కుబడిగా సమర్పించేవారు. వీరు శాస్త్రబద్ధమైన నాట్యం చేసేవారు. రాజులుకూడ 'దేవాలయ కాంతల' పద్ధతిని పోషించి వారివలన వచ్చే రాబడిని సైన్యపు ఖర్చులకు వినియోగించేవారు. దేవుని పేరుమీద వదలివేయబడిన వీరు త్వరలోనే పడుపుకత్తెల స్థాయికి దిగజార్చబడ్డారు. తెలుగు దేశంలో వీరిని బసివిరాండ్రు, దేవదాసీలు అని వ్యవహరించేవారు. బసవని పేరుమీద వదిలిన వారిని బసివిరాండ్రనీ, వైష్ణవాలయాలకు సమ ర్పించబడిన వారిని దేవదాసీలని పిలిచేవారు. వేమన్న పద్యాల్లో పేర్కొన బడిన వ్యభిచారిణులు చాలామంది ఇటువంటి మత సంప్రదాయం నుంచి వచ్చినవారే.

## మహమ్మదీయ మతపు లేత సీడలు

వేమన్న కాలంనాటికి మహమ్మదీయ సింహాసనాల నిలువెత్తు నీడలు ఆంధ్రదేశ మంతటా వ్యాపించాయి. రాయలసీమలో దుర్గాలన్నింటికి మహమ్మదీయులు అధిపతులైనారు. అయితే కేంద్రాధికారులు మహమ్మ దీయులే ఐనప్పటికి గ్రామాలను స్థానికులే వారి ప్రతినిధులుగా పాలించారు.

ముస్లింలు సాధారణంగా రాజధానులలో, పట్టణ ప్రాంతాల్లో నివసించేవారు కాబట్టి ఆ ప్రత్యక్ష సంబంధం వలన అక్కడి హిందూ జీవన విధానంపైన వారు గాఢమైన ముద్ర వేయగలిగారు. దీనికి వారి అధికారం కూడ తోడయ్యింది.

భారతదేశంలో అనేక మతాలు పుట్టి ప్రవర్తిల్లి పతనమైనాయి. వెలుపలి నుంచి వచ్చిన మతాలు కూడ ప్రబలంగా వున్న భారతీయ సభ్యతాప్రవాహంలో లీనమై కరిగిపోయినవి. కాని ఇస్లాం విషయంలో జరిగిన తీరు వేరు. ఇది తాత్త్వికంగా హిందూమతంతో భేదించినదే కాక విరుద్ధమైనదే కూడ. హిందూమతంలో ఐహికం కన్నా పారలౌకిక దృష్టికే ప్రాధాన్యం. కాని ఇస్లాంలో ఈ ఐహిక నిర్లిప్తత అసలే లేదు. ఇహ, పరాల మధ్య ఒకానొక తూకం దానికున్నది. ఎప్పుడైతే ఈ రెండు మతాలు కలిసి జీవించవలసి వచ్చిందో కలిసిన మరుక్షణం నుంచి సహజంగానే సంఘర్షించుకోవటం ప్రారంభించాయి. కాని ఈ సంఘర్షణ ఒకదానినొకటి చాపకింది నీరులాగ నిశ్శబ్దంగా ప్రభావితం చేయటం మొదలుపెట్టాయి.

గ్రామాలు పట్టణాలకు దూరంగా వుండటంవల్ల ఈ ప్రభావం అక్కడి మత వ్యవస్థ పరిపూర్ణతను భంగపరచలేకపోయింది. కాని దీనివలన ఇస్లాం మత ప్రభావం గ్రామాలవరకు పూర్తిగా ప్రయాణించలేదని చెప్పటానికి వీలులేదు. పట్టణాలనుంచి గ్రామాలకు నిరంతరం రాకపోకలు మొదలు కావటంవల్ల ఆ ప్రభావం ప్రత్యక్షం కాక పరోక్షమైంది.

దక్షిణదేశంలో ఇస్లాం మతం ప్రవేశించేనాటికి హిందూమతం శక్తిహీన స్థితిలో కొట్టుమిట్టాడుతూంది. కులవ్యవస్థ, దంభజీవితం వున్నకాలం. పరదేశీయుల దండయాత్రల వలన ఒక విధమైన నైరాశ్యం అన్ని రంగాలలో తాండవమాడుతున్నది. అటువంటి పరిస్థితిలో ఇహ ప్రధానమైన ఇస్లాం సుడిగాలివలె వీచింది. ఈ దేశంలో అది సరికొత్త సుడిగాలి.

నూతన వాయుస్పర్శతో ఇక్కడి వ్యవస్థలు చలించటం మొదలైంది. మతాలు వేసుకున్న మాయవేషాలు రెపరెపలాడినవి. హిందూవ్యవస్థలోని బాధితులు, దీనజనులు ఈ మార్పును అనుకూల దృష్టులతో చూశారు. సజీవ కళలను కోల్పోయిన స్వమతాలు, అపూర్వ తత్వంతో దిగిన ఇస్లాం ఈ రెండింటి కలయిక దేశంలో తర్కశీలానికి బీజావాపనం చేసింది. కుల భేదాలు లేని అన్యమత ఆగమనం వలన భారతీయ వర్ణవ్యవస్థ చలించ సాగింది. పాత విధానాలకు కొత్త భావాలకు మధ్య జరిగిన ఈ ఒరిపిడిలో ఒక రకమైన సందిగ్ధ వాతావరణం పొగమంచులా వ్యాపించింది. సరిగ్గా ఇటువంటి పరిస్థితుల్లోనే భావుకులైనవారు తత్త్వాన్వేషణకు పూనుకున్నారు. ఈ అన్వేషణలో వారికి కొత్తగా అబ్బిన తర్కశీలం సాధనమైంది. వినూత్న తత్త్వఘోషలో కొత్త గొంతులు వినిపించగానే స్వమతంలోని సంఘ లోపాలు స్పష్టంగా కనిపించాయి. కొత్త భావాల ప్రవేశంతో హిందూమతం కుంచించుపోయి తన్ను తాను రక్షించుకోవాలని తాపత్రయ పడింది. ఆ ప్రయత్నంలోనే తత్త్వాన్వేషకులకు సంఘ లోపాలు అడ్డు తగిలాయి. కాబట్టి ఆ సంఘలోపాలను తొలగించనిదే హిందూమత పునరుజ్జీవనం సాధ్యంకాదని త్వరలోనే వారు గుర్తించారు.

సరిగ్గా ఇటువంటి చారిత్రకావసరం వల్లనే వేమన, వీరబ్రహ్మం లాంటివారు ప్రజా సంప్రదాయాలను పుణికిపుచ్చుకొని వెలువడ్డారు.

## వేమన్న జీవితం

వాడుక కథల్లోని వేమనే మన కిప్పుడు దొరకుతున్న వేమన. ఆ వాడుక కథలు కూడ వేమన పేరునుబట్టి వేమన పద్యాల్లోని బంగారపు ప్రసక్తి, వేశ్యలప్రసక్తిని బట్టి పుట్టాయి. ఈ కథల్లోని వేమన రక్త మాంసాలతో మన మధ్య తిరిగే సామాన్య మానవుడు కాదు. అతీంద్రియ శక్తులతో అద్భుతాలను చూపే అమానుషుడు. ఈ కథలే దేశమంతటా ప్రచారంలో వున్నాయి. ఈ ఇతివృత్తంతో ప్రబంధఫక్కీలో కావ్యాలూ, నాటకాలూ, సినిమా వెలువడ్డాయి.

వేమన్న భౌతిక జీవితాన్ని గూర్చి కొంచెమైనా చెప్పటానికి పద్యాలే ఆధారం. ఏ కవిత్వమయినా కొంతవరకు అతని ఆత్మకథవంటిదే. కవి అభిరుచులు అభ్యంతరాలు, పుట్టిపెరిగిన వాతావరణం, స్వభావాన్ని తీర్చి దిద్దిన పరిస్థితులు, అభిప్రాయాలు, వాటి పరిణామం మొదలైనవన్నీ భావుకుని రచనలలో ఏదో ఒక ప్రమాణంలో, రూపంలో బయటపడక తప్పదు. కాని వేమన వంటి ఆశుకవిని గూర్చి స్పష్టమైన వివరాలను సేకరించటంలో అనేక చిక్కులున్నాయి. ఆధారాలు మీద నిర్మించే ఊహా సౌధమేకాని, తిరుగులేని ఆధారాలను ప్రదర్శించటం కష్టం. వ్యక్తి జీవితం సమాజ పరిస్థితులతో ముడిబడి వుండేమాట నిజమే అయినా ప్రతిభావంతుడి జీవితంలో విశేషాంశాలు సంఘటనలు వుండటం అరుదు కాదు. వేమన్న జీవితాన్ని పరిశీలించేటప్పుడు ఈ దృష్టి అనవసరం.

ప్రచారంలో వున్న కథల్లో అసంబద్ధమైన అంశాల్ని వదలిపోపి వేమన్న జీవితాన్ని ఈ కింది విధంగా ఊహించొచ్చు.

వేమన 17వ శతాబ్దంలో రాయలసీమలోని ఒకానొక పల్లెలో ఒకానొక మోతుబరి రైతుకుటుంబంలో పుట్టాడు. ఇక్కడ వేమన రెడ్డా? కాపా? రాయలసీమలో రెండూ ఒకటేనా? అనే చర్చ ఫక్తు అనవసరం. వేమన సాంస్కృతిక నేపథ్యం అర్థంచేసుకోటానికి రైతు కుటుంబం అని తెలిస్తే చాలు.

చిన్నతనంలో వేమన గారాబంగా అల్లర చిల్లరగా పెరిగాడు. గ్రామంలో భూస్వామ్య కుటుంబం కాబట్టి కొంత పొగరు. మాటసాగిన వాడూ, మాటకారీ కాబట్టి స్నేహితు లందరికీ నాయకుడు. అగ్ర, నిమ్న కులా లనకుండా అన్ని రకాల స్నేహితుల్తో తిరిగేవాడు. ఒకచోట కాలు నిలవని అస్థిర స్వభావం ఏర్పడింది. పొలం బాధ్యతలు పట్టలేదు. ఊరి దేవళాల్లో అయ్యవార్లు చెప్పే ఆధ్యాత్మిక విషయాలు, హరికథలు, తోలు బొమ్మలాటలు మొదలైనవి వేమనకు పురాణ పరిచయాన్ని కలిగించాయి. అన్ని మతాల వారితో అంటుకొని తిరగటంవల్ల వేమనకు ఆ యా మతా

లతో గాఢమైన పరిచయం కలిగింది. వేమనకు యుక్తవయస్సు వచ్చింది. ఆనాటి మత సంస్థల్లో పేరుకొనిపోయిన అవినీతి, దేవదాసి, బసివి సంప్రదాయం, పెచ్చు పెరిగిన వ్యభిచారం ఇవన్నీ వేమనమీద ప్రభావం చూపాయి. ఈ సమయంలోనే కుటుంబం ఆర్థికంగా చితికిపోవటమో, వేమన్నకు వివాహం జరిగి అన్నదమ్ములు వేరుపడటమో జరిగివుంటుంది. ఇన్నాళ్ళు బాధ్యత లేకపోవటం వల్ల కట్టుగుడ్డల్తో వీధిని పడివుంటాడు. గారాబంచేసి, బలహీనతల్ని సర్దుకుపోయే తల్లి చచ్చిపోయి వుంటుంది. డబ్బులేని వేమన్నను వేశ్యమాతలు తన్నితగలేసి వుంటారు. భార్య వగ్గ చులకనై పోయి వుంటాడు. ఇవన్నీ వేమన్న జీవితం తిరిగిన మలుపుకి కారణాలుగా భావించొచ్చు.

చెడు అలవాట్లు ఒక్కరోజులో వదిలిపోవు కాబట్టి ఊరినిండా అప్పులు చేశాడు. వచ్చినప్పుడు సాధ్విగా వున్న భార్యకు వాయీగాయీ అలవడ్డాయి. ఆమె వేమన్న మాట వినటం మానేసింది.

అప్పులవాళ్ళు కూడ దారులు కాస్తున్నారు. రసవాదులతో చేరి బంగారం చేసే విద్యను నేర్చుకుందామనుకున్నాడు. ఎవరికి చెప్పకుండా వేమన్న ఊరు విడిచి దేశంమీద పడ్డాడు. ఎక్కడైనా పట్టణాల్లో ఉద్యోగం చేద్దామనుకున్నాడు, కాని అది కుదరలేదు. రాజుల నమ్మరాదనే అభిప్రాయానికి వచ్చాడు. వేమన్నకు పద్యాలు అల్లే అలవాటు మొదటినుంచీ వుంది. వాటిని ఒకరిద్దరు అధికారులకు, కవులకు వినిపించి చూశాడు. వారతని పద్యాలను కవిత్వంగా గుర్తించ లేదు. వాళ్ళకు కావలసిన కవిత్వం ఇది కాదని తెలుసుకున్నాడు. దేశదిమ్మరిగా ఊరూరు సంచారం మొదలుపెట్టాడు. కాని ఉన్నవూరు విడిచిన వానికి వేరేచోట బలంలేదని త్వరలోనే తెలుసుకున్నాడు. ఎంత భూమి తిరిగినా లాభం లేదని మళ్ళా ఊళ్ళో కొచ్చాడు. కుటుంబ సభ్యులు అసహ్యించుకున్నారు. ఊళ్లో వాళ్ళందరూ ఎగతాళి చేశారు.

అందరూ తనలోనే తప్పులెన్నుతున్నారు. వారికి తనను వేలెత్తి

చూపే నైతికబలం లేదనే "గుర్తింపు" కలిగింది. వారి పూర్వ జీవితాలను పడదిట్టాడు. మాసిన బట్టలతో, పెరిగిన గడ్డంతో వున్న అతన్ని లోకులు పిచ్చివానిగా జమకట్టారు. "వెర్రి వేమన" అనే బిరుదును ప్రసాదించారు. సానివాడల కెప్పుడో వీడ్కోలు చెప్పాడు. నిజంగానే వేమన్న కీ ప్రపంచం మీద విరక్తి పుట్టింది. తాను ఇది వరకు కోరి చేసిన పనులను తానే ఖండించుకునే స్థితికి ఎదిగాడు. పశ్చాత్తాపం కలిగింది. కాని అప్పటికే చాలా ఆలస్యం జరిగిపోయింది. శాంతి కరువైంది. నీడపోయింది. గోసాయి గుంపులతో ఊరూరు తిరగసాగాడు. కాని వారి తప్పులను ఎత్తి చూపి వారికి కూడ దూరమయ్యాడు. అడవులలో, కొండ గుహలలో శాంతికి మార్గం చూపే వారికోసం వెతికాడు. దేశసంచారంలో అతడికి అన్యాయాలు బాగా అర్థమయినాయి. అన్యాయాలకు గురైన వాళ్ళు అతనికి శిష్యులైనారు. సహించలేని వాళ్ళు రాళ్ళతోకొట్టి వెంట తరిమారు.

లౌకిక స్పృహను విస్మరించి వైరాగ్యంతో దిగంబరాన్ని ధరించాడు. సమాజ రీతులకు అతని ప్రతిస్పందనలే ప్రజలకు ఉపదేశాలైనాయి. నగ్న వేమననుచూసి లోకులే సిగ్గుపడ్డారు, కాని వేమన దాని నెప్పుడో జయించాడు.

ఎవరు విన్నా, ఎవరు వినకున్నా జ్ఞానమార్గాన్ని ఉపదేశించి దేశ మంతా తిరిగి, రొష్టుపడీ, ఉద్రేకపడీ, అన్వేషించీ ఎప్పుడో, ఎక్కడో వేమన తనువు చాలించాడు.

## VII

వేమన పద్యాలకు వ్యాఖ్య రచించే అవకాశం నా కిచ్చిన హైదరాబాదు బుక్ ట్రస్టు వారికి కృతజ్ఞతలు.

వ్యాఖ్య, పీఠిక ఒకటికి రెండు సార్లు సవిమర్శకంగా చదివి తగిన చేర్పులు మార్పులు సూచించారు చేకూరి రామారావుగారు. ఇందుకు ఈ పుస్తక ప్రచురణలో వారికున్న బాధ్యతకన్నా పూర్వ విద్యార్థి నన్న అభిమానమే ప్రధాన కారణమని భావిస్తున్నాను.

—గోపి

15-5-1980

# అంచనాల అంచుల్లో వేమన

## (మలిముద్రణ పీఠిక)

"వేమన కాలం గడిచి మూడు శతాబ్దాలు కావస్తున్నా వేమన పద్యాలను అధ్యయనం చెయ్యవలసిన దృష్టి మనకేర్పడలేదు" అని ఏడాది కిందట వేమన్నవాదం మొదటి పీఠికలో రాశాను. ఈ ఏడాదిలో వేమన్నను గురించి ఎందరో జిజ్ఞాసువులు ఆలోచనలు చేశారు. వాద వివాదాల్లో పాల్గొన్నారు. అంచనాల అంచుల్లోకి వేమన్నను లాక్కొస్తున్నారు. పూర్వపరిశోధకులు వేమన్నను రెడ్డిగానో, కమసాలిగానో, బ్రాహ్మణుడిగానో చెయ్యటానికి ప్రయత్నించారు. అది చాలదన్నట్లు ఇటీవల కొందరు వేమన్న కాపు కాబట్టి కమ్మ కూడా కావచ్చునని ఊహలు చేస్తున్నారు. దీనికి అంతం ఎక్కడ?

వీటి అన్నిటికి తోడు వేమన్నను గురించి పరిశ్రమించేవారి మధ్యన ఏ కారణం వల్లనో సామరస్యం కుదురుకోలేదు. మన రాతలపైకి మనమే రాకాసి లైట్లను ఫోకస్‌చేసి పూర్వపరిశోధకుల కృషిని 'బ్లాకౌట్' చెయ్యటమనే పద్ధతి మొదలయింది.

ఫలానా పండితుడు కొన్ని కారణాలవల్ల ఫలానా గీతను దాటి చూడడు. కొన్ని ఆకారాలు అతనికి అక్కరలేదు. అంతమాత్రాన అతని పాండిత్యాన్నీ, నిజాయితీనీ "ప్రశ్నార్థ సంజ్ఞితం" చెయ్యబూనటం పరిమితుల్ని విస్మరించటమే. ఉదాహరణకు: రాళ్లపల్లి బ్రౌన్‌ని దాటి చూడలేదనటం ఇట్లాంటి అన్యాయమైన మాట. ఆ మాటకొస్తే చాలామంది బ్రౌన్‌ని అధిగమించారు. బ్రౌణోన్మాదం లేకుండా, బ్రౌన్ కృషిని తక్కువ చెయ్యకుండానే బ్రౌన్‌కు వేమన పద్యాలన్నీ పూర్తిగా అర్థం కాలేదనటానికి ఆయన చేసిన అనువాదాల్లోంచే సాక్ష్యాలు చూపొచ్చు. బ్రౌన్‌ది పరిష్కరణ దృష్టి. వేమన్నను గురించి ఆయన సేకరించిన వివరాలు ఆయన విచారణలవల్ల సేకరించినవే గదా!

వేమన పద్యాలపట్ల నాకున్న ప్రగాఢాభిమానం వల్లనే ఇదంతా రాయ వలసి వస్తున్నది. వేమన్నవాదంపై వచ్చిన విభిన్నాభిప్రాయాలను సూత్ర ప్రాయంగానైనా పరామర్శ చెయ్యాలని తాపత్రయం కలుగుతున్నది.

పండితులు కాని పాఠకులు వేమన్నవాదంలోని వ్యాఖ్యాన పద్ధతిని హృదయపూర్వకంగా ఆమోదించారు. కొందరు పండితులు మాత్రం దీని లోని పాఠనిర్ణయాలపట్ల కొన్ని సందేహాలు వెలిబుచ్చారు. రమణీయత్వా నికీ, శబ్దసాధుత్వానికీ అనుకూలంగా వేమన పద్యాలను దిద్దాలని సూచించారు. వేమన్న వాదంలో ఏ మార్గదర్శక సూత్రాలపైన ఆధారపడి పద్యాల ఎన్నిక జరిగిందో మొదటి పీఠికలోనే స్పష్టపరిచాను. సత్యంపైన, రుజువుపైన, చారిత్రక సాక్ష్యాలపైన ఆధారపడవలసిన పరిస్థితికి నిబద్ధున్ని కాబట్టే వేమన పద్యాలను దిద్దగలిగిన స్వాతంత్ర్యంగానీ, అధికారంగానీ, ధైర్యంగానీ నాకు లేవు. వేమన్నపైన 18 ఏండ్లు పరిశ్రమించిన బ్రౌనే ఈ సాహసానికి ఒడి గట్టలేదు. ఈ కారణంవల్లనే పరిష్కరించేటప్పుడు బ్రౌన్ పాదపీఠికలను, లఘువ్యాఖ్యలను పోగుఐపోసి సమర్థించుకోవలసి వచ్చింది. అనేక పాఠాం తరాలున్నప్పుడు అర్థసహమైన లేక ప్రాచీనమని తెలిపిన పాఠాన్ని ఎన్ను కోవటమే ప్రస్తుతానికి చెయ్యగలిగింది. వేమన పద్యాల పాఠనిర్ణయ ముద్రణం (difinitive edition) దిక్కుగా 'వేమన్న వాదం' ఒక అడుగు ముందుకు వేసిందని మాత్రమే ఇక్కడ చెప్పదల్చుకున్నాను.

## తననాటి పరిస్థితుల్లో వేమన ప్రత్యేకత

వేమన్ననాటి పరిస్థితుల్ని అంచనా వెయ్యటంలో భిన్నస్వరాలు విన్పిస్తున్నాయి. ఈ విషయంలో నా ఇటీవలి ఆలోచనలను ప్రకటిస్తాను.

గ్రామాల్లో తయారయ్యే వస్తువులు మార్కెట్లకెగబాకిన దశలో ఫ్యూడల్ వ్యవస్థ పగుళ్ళు వారింది. రైతులు పండించిన ధాన్యం, చేతిపనుల వారి ఉత్పత్తులు గ్రామసీమలు దాటుతున్నాయి. ముందే ప్రారంభమైనా మొగలాయీల కాలానికి డబ్బురూపంలో పన్ను చెల్లించటం ముమ్మర

మైంది. ఈ పరిస్థితికి వేమనపద్యాల్లో సూచనలు కనపడతాయి. మారిన కొత్త పరిస్థితుల "వివరం" రైతులకు, ఇతర చేతివృత్తుల వారికి అర్థంకాక వెర్రిమొగాలు వేశారు. సందిగ్ధ వాతావరణం ఏర్పడింది. నైరాశ్యం అలముకుంది. బహుశా అట్లాంటి రైతులమీద జాలిపడుతున్నాడు వేమన.

కాపుకులజులెంత కర్మలైనాగాని
పాపరాశి గొంత పరిగిపోవు
వివరమెరుగునట్టి వెర్రిజీవులు గాన
విశ్వదాభిరామ వినురవేమ.

కష్టపడి పండించిన కళ్ళంలోని ధాన్యపురాశిని పూర్వజన్మల పాపాల గుట్టగా సరిపెట్టుకున్నాడు వెర్రిరైతు. దాన్ని రాక్షసశిస్తుల పేరుతో దోచుకునే వాళ్ళే పాపులన్న "వివరం" అతడికి తెలియదు. ('పరిగె'ను 'పరిగిపోవు' అని క్రియారూపంగా వాడుతున్నాడు వేమన)

కాపులు "వాకెరుంగ"ని వారుగా మారిపోయారు. గ్రామ వ్యవస్థలో దేవభాగం, రాజభాగం నిర్ణయించటం, కల్లుచెట్ల పంపకం, పశువుల పుల్లరి బీళ్ళ కేటాయింపు మొదలైన అన్ని వ్యవహారాలు దేవుడి సాక్షిగా ఖరారయ్యేవి. కల్లు దొంగల గురించిన వేమన పద్యం కనిపిస్తున్నది. వ్యాపారం ముమ్మరమైనప్పుడు అది వ్యవసాయాన్ని శాసిస్తుంది. భూమి బీడయ్యే పరిస్థితు లేర్పడేవి. భూమిమీద తీయవలసిన పంటంతా తీయకపోతే పాపం అని రైతు నమ్మకం. అందుకే కాపులు అమాయకులని వేమన పలు సార్లంటాడు. కొత్తగా వచ్చిన వ్యాపారనాగరికతను మింగలేకనే "రాజ సమితికెల్ల రంపముల్ వైశ్యులు; కోమటోని సొమ్ము క్రూరుల పాలౌను" వంటి అభిప్రాయాలు వేమనపద్యాల్లో లభిస్తున్నాయి.

వేమన కాసు, వీసం, దమ్మిడీ, తారము, రూక వంటి నాణాలను పేర్కొన్నాడు. డబ్బు చెలామణిపట్ల ఈసడింపు వేమనపద్యాల్లో కన్పి

స్తుంది. "కాసు తీర్చులేక మోసపోరె; చేతి కాసులెల్ల చేరదీసు; కానివాని చేత కాసు వీసములిచ్చి; పరుల మోసపుచ్చి యొకరూక పాతికె."

మారిన పరిస్థితుల్లో పాత అలవాట్లకు కొత్తభావాలకు ఘర్షణతప్పదు. 15, 16, 17 శతాబ్దాల్లో ఈ రాపిడి అన్ని రంగాల్లో కనిపిస్తుంది. గ్రామీణ వ్యవస్థలోని సంకుచిత భావాలను, మూఢనమ్మకాలను, దురలవాట్లను వ్యతిరేకించే ధోరణి ఒకటి బయల్దేరింది. ఇది తాత్త్విక అన్వేషణ రూపంలో చిన్న కులాల్లోంచి వెలువడింది. కబీర్ (నేతపనివాడు), నానక్ (కట్టు పనివాడు), వేమన (కాపు) మొదలైన అనేకులు ఈ దారికి మూలపురుషులు. సాహిత్యరంగంలో భక్తి ఉద్యమంగా దీనికి పేరువచ్చింది. మారిన పరిస్థితుల్లోని నిరాశని, కొత్తని ఎట్లా అర్థంచేసుకోవాలో తెలియని ప్రజల సందిగ్ధతని వీళ్ళు ప్రతిబింబించారు.

వేమన పద్యాల్లోని కోపం నైరాశ్యభావం నుంచి పుట్టినప్పటికీ, వీర బ్రహ్మం వంటి వారివలె తాత్త్వికస్థాయిలోనే మిగిలిపోలేదు. మారని శక్తుల వ్యతిరేకతను ప్రతిఘటించాడు వేమన. ఇది చాలా పద్యాల్లో కనిపిస్తుంది. అయితే వేమన ప్రతిఘటనలు వైరుధ్యభరితాలు. గ్రామవ్యవస్థ దురలవాట్లు, స్త్రీలను హీనంగా చూసే దుస్సంప్రదాయం అతడిని వదిలిపెట్టలేదు.

వేమన ప్రతిఘటన కులవ్యవస్థ ఖండన రూపంలోనే యెక్కువగా కనిపిస్తుంది. ముస్లింల రాకతో ఒకరకంగా కులవ్యవస్థకు రాజకీయ మూలాధారం పోయింది. అప్పుడిక భయసందేహాలతో మరింత బిగుసుకుపోయి ఘనీభూతస్థితిలో ఉంది. ఇన్నాళ్ళ చైతన్యరహితమైన గ్రామీణ వ్యవస్థ కూడా కులాలు ఉండటానికే దోహదం చేసింది. ఆర్థికవ్యవస్థలో మార్పులు మొదలైనప్పుడే కులవ్యవస్థకు ప్రకంపనాలు పుట్టాయి. వ్యాపార వాయువులు వీస్తుంటే అంటరానితనాన్ని క్రూరంగా పాటించడం కూడ కష్టమౌతుంది. అప్పుడప్పుడు చిన్నకులాల్లోని తెలివైనవాళ్ళ, నిపుణుల శ్రమ అవసరం అనివార్యమౌతుంది. ఈ కారణంవల్లనే పైకి పటిష్ఠంగా కని

పించినా గ్రామవ్యవస్థ పునాదులపై నిలబడ్డ ఐదంతస్తులమేడ బీటలువేయ నారంభించింది. ఈ బీటలను సున్నంతో కాపటం ఛాందసుల పని. కేంద్ర రాజ్యంలేని కాలంలో పీడన నిత్యకృత్యం. వలసలు మొదలవుతాయి, పన్నులు కోరలవుతాయి. అవసరం కొద్ది కులవృత్తులను వదిలేసి ఇతర వృత్తులను చేపడతారు. ఇట్లాంటి సంక్లిష్ట పరిస్థితి అనేక రంగుల్లో కొత్త భావాలకు దోహదం చేస్తుంది. దర్శనమున్నవాడు, హృదయమున్నవాడు కొత్తపాతల సమ్మేళనంతో గొంతు సవరిస్తాడు.

అంతేకాక కులం సంఘశాంతిని ఎట్లా నాశనం చేస్తుందో వేమన్న ప్రత్యక్షంగాచూసి ఉంటాడు. బ్రాహ్మణేతరుల్లోకూడ ఎడమచేతి కులాలు, కుడిచేతి కులాలు అని రెండువర్గాలుగా ఏర్పడి హోదాలకోసం కొట్లాటలు సృష్టిస్తుండేవని అబేదుబాయ్ రాశాడు. "మదరాసు" ప్రాంతంలో వీటిమధ్య రగుల్కొనే సంఘర్షణను సవివరంగా తారాచంద్ వర్ణించాడు. ఇటువంటి సంఘటనల్తో విసిగికూడ ధ్వజమెత్తి ఉంటాడు వేమన.

వేమన మొదట్లో ఉగ్రవాదపంథా నవలంబించి తర్వాత ఇది దారి కాదని వెనక్కొచ్చి దాన ధర్మాలను బోధించాడని త్రిపురనేని వెంకటేశ్వర రావుగారు ఒక కొత్తవాదాన్ని లేవదీశారు. అందుకు ఈకింది పద్యం ఆధారం.

ద్రోహబుద్ధినైన దొంగరికమునైన
సటలనైన సాహసమునైన
సంపదధికునుండి సాధించి ధనమున
బడుగు కిచ్చెనేని బాగు వేమ.

(ఎస్. వి. గోపాల్ అండ్ కో ప్రతి)

ఈ పద్యంతప్ప ఇటువంటి భావాన్నిచెప్పే పద్యం మరోటి కనిపిం చదు. జైనమత సంస్థలు క్షీణదశలో ఇటువంటి భావాలను శిష్యులకు బోధించిన దాఖలాలున్నాయి. ఇది వేమన పద్యం కాకపోవటానికే ఎక్కువ కారణాలున్నాయి. పూర్తి మకుటంలేని నాలుగులైన్ల పద్యాలు, కందాలు

మొదలైనవి వేమనపద్యాలు కావనే వాదం చాలాకాలంగా వుంది. కాదు, ఇది వేమనపద్యమేనని పట్టుబడితే దీనికి వ్యతిరేకార్థ మిచ్చే పాఠాంతరాన్ని బ్రౌన్ తాటాకుల్లోంచి ఎన్నికచేసి పెట్టాడు.

'బడుగు కిచ్చెనేని పశువు వేమ'

పై పద్యం వేమనదే అయితే ఈ పాఠాన్నికూడా నమ్మాల్సి వుంటుంది కదా. కాబట్టి పరిష్కరణ పరమైన చిక్కులు తొలగేదాకా ఒకటి రెండు పద్యాల ఆధారంగాచేసే సిద్ధాంతాలు నిజాన్ని నిరూపించలేవు.

## పండిత దృక్కులు

'వేమన్నవాదం'ను పత్రికల్లో, రేడియోలో సమీక్షించిన కొందరు సమీక్షకులు కొన్ని పద్యాల్లో ఛందస్సు తప్పిందనీ, యతిభంగాలు జరిగాయనీ కొన్ని పాదాలను ఎత్తిచూపారు. చేకూరి రామారావుగారుకూడా How do you explain metrical slips? అని దోషాలుగా కనిపించే వాటిలోని అంతస్సూత్రాలను కనుక్కోవాల్సిన అవసరాన్ని గుర్తు చేశారు. అంతేకాక మార్గాన్వేషణకు సహకరించారు.

ఛందో భంగాల్లాగా కనిపించే పాదాలు కొన్ని ఇవి:

1. నడవనేరని వాని నడపీను గందురు
2. కనులు పోయినవాడు కాళ్ళు పోయినవాడు
3. మక్కుకు పోనేల మగిడి తా రానేల.
4. మాళ్లు వెంటరావు మణులు వెంటరావు.

పై పాదాలన్నిటిలోను ఉన్న ఒక సమానలక్షణం ప్రతి పాదాన్నీ మాత్రా సంఖ్య ననుసరించి రెండర్ధ భాగాలుగా విడదీయొచ్చు. ఈ నాలుగుదాహరణలూ ఆటవెలది తేపి పాదంతో సరిపోవాలి. కాని మొదటి రెండు ఉదాహరణల్లో మొదటి అర్ధభాగంలో ఒక్క అక్షరం ఎక్కువయింది. మూడో ఉదాహరణలో ఈ భాగం పూర్తిగా వేరుగా వుంది. ఈ మూ

డుదాహరణల్లోను మూడు సూర్యగణా లుండవలసినచోట ఒక అక్షరం ఎక్కువై గణభంగమయింది. గణభంగమయిన ఈ భాగాలు తరవాత భాగాల్లో వున్న రెండింద్రగణాలతో సమానం కావటం ఇక్కడ విశేషం. ఇంద్రగణాల్లో అయిదుమాత్రల గణాలు వాడితే దాన్ని ఖండగతి అంటారు. గణభంగమయిన పూర్వభాగాలు కూడా ఉత్తర భాగాలతో సమానమయి మొత్తం పాదానికే ఖండగతిని కూర్చినాయి. త్రిశ్ర, ఖండగతుల సమ్మిశ్రంగా వుండే ఆటవెలది బేసిపాదం ఈ మార్పుతో ఖండగతిగా మారింది.

చివరి ఉదాహరణలో ఉత్తరభాగంలో గణభంగం అయింది. అంటే రెం డింద్రగణా లుండాల్సినచోట మూడు సూర్యగణాలున్నాయి. ఒక్కోసారి మూడు సూర్యగణాలు రెండింద్రగణాలు కూడా అవుతాయి. ఉదాహరణకు 'పంచదారకన్న పనస తొనలకన్న' అనే పాదంలో కింద గీతవుంచిన భాగాన్ని ఛందస్సు ప్రకారం రెండింద్రగణాలుగా విడదీయాల్సి వున్నా నడక ప్రకారం మూడు సూర్యగణాలుగా విరుగుతాయి. అళువుగా చెప్పే పద్యాలు నడక కనువుగా ఉండటం విశేషంకాదు. ఈ రకంగా ఛందస్సు సరిపోతూ మొత్తం త్రిశ్రగతిలో నడిచే పాదాల నడక ప్రభావంతో ఇట్లాంటి గణభంగమైన భాగాలు చేరినాయి. ఈ రకమైన గణభంగాలు బేసి పాదాల్లోనే జరిగినాయి. భిన్నగతులున్న బేసిపాదాన్ని ఏకగతిగా మార్చటంలో ఏర్పడ్డవి ఈ గణభంగాలు. ఒకచోట మొత్తం ఖండగతిలోకి మారితే ఇంకోచోట మొత్తం త్రిశ్రగతిలోకి మారింది. దీన్ని ఛందస్సమీకరణం అనొచ్చు. ఈగతి సమీకరణాన్ని దృష్టిలో పెట్టుకొనే కాబోలు బ్రౌన్ దీన్ని దర్వ్యమర్యాద అని పిలిచాడు. వేమనపద్యాలు అళు సంప్రదాయంలోవి అనటానికి ఈ 'తప్పులు' గొప్ప ఆధారాలు.

ఇక యతిభంగాల విషయం :

"దొక్క దోమినంత దొరుకునా మోక్షంబు"

"దొక్క కొరకు ఊళ్ళు దొంగిలించి."

'ద, డ'ల కున్న ధ్వనిసామ్యం స్పష్టమే. ఈ ధ్వని సామ్యంవల్ల పూర్వపు కవుల్లో కొందరు ఈ రకమైన యతి వాడారు. శ్రీనాధుని కాశీ ఖండంలో "పిండి పేచంబుగాఁ బృథివీ భరంబుల దంతునే కాలదండమున నభవ" (కాశీ. 7-80) అనే ప్రయోగం వుంది. ధ్వని సామ్య ప్రధానమైన యతిని అట్లాగే చూడాలికాని, లాక్షణిక దృష్టితోకాదు.

బ్రౌన్‌కూడా "-ఓటికుండ నీరుపోసిన చందాన" (ఇది ఉచ్చారణలో 'వోసిన చందాన' అని ఉండొచ్చు) అనే ప్రయోగాన్ని ఉదహరించి, **'The rhyme in this line is evidently wrong'** అని వ్యాఖ్యానించాడు. 'భిన్న ఘటము నీరు చన్న చందంబున' అనే సవరణ సూచించాడు. కాని వెంటనే తన్ను తాను సవరించుకొని **"It would not however be expedient to alter the text...where ever the metre, the grammar or the style have been left imperfect by the author'** అని వున్న రూపాల్ని దిద్దగూడదన్న అభిప్రాయం వెలిబుచ్చాడు.

## వేమన "పండితుడు" కాదు

వేమన్నను మరింత గొప్ప చెయ్యటానికో ఏమో ఈమధ్య కొందరు విమర్శకులు వేమన్న "గొప్ప పండితు"డని చెప్తున్నారు. వేమన్న పండితుడు కాదు. సంస్కృతాంధ్ర భాషల్లోని బహుగ్రంథాధ్యయనంవల్ల ఏర్పడిన పాండిత్యం కాదని అభిప్రాయం. వేమన పండితు డనేమాట అతన్ని సమర్థించే మాటకాదు. మన పాండిత్యాన్ని సమర్థించుకోటానికి పనికివచ్చే ఊత.

సంస్కృత శ్లోకాలకు ప్రతిబింబా లనదగిన కొన్ని వేమన పద్యాలను బట్టి వేమన వాటిని అనువదించాడనే అపోహకు తావేర్పడి, అతను సంస్కృతం బాగా చదువుకున్నా డనేవరకు దారితీసింది. దీనికి ఒకటి రెండు ఉదాహరణలుకూడ కనపడుతున్నాయి.

1. "అవసర పఠితావాణీ గుణగణ రహితాపి(?) వహతాపరమోదం
రతిసమయే యువతీనాం భూషాహానిశ్చ భూషణం భవతి.

[ప్రసంగరత్నావళి — పండితరాయలు(?)]

"ప్రస్తుతంపువేళ పద్యంబు చదివిన
తప్పులున్న మిగుల నొప్పియుండు
వెలది సురతవేళ బిత్తలైయుండదా"

2. శత్రుః కృతాపరాధః శరణ ముపేత్యపాదయోః
పతితః శస్త్రేణ హంతవ్యం ఉపకార హతస్తు కర్తవ్యః.

(మృచ్ఛకటికా)

"చంపదగిన యట్టి శత్రువు తనచేత
చిక్కెనేని కీడు సేయరాదు
పొసగ మేలుచేసి పొమ్మనుటే చావు"

అట్లాగే హితోపదేశం లోని కొన్ని శ్లోకాలకు అనువాద ప్రాయాలయిన పద్యాలున్నాయి.

పై శ్లోకాలగ్గానీ, వేమన పద్యాలగ్గానీ మూలం సమాజజీవనం. జాతి రక్తంలో కలిసిపోయి జవాన్నీ, జీవాన్నీ నిలుపుకున్న అనేకానేక సూక్తులూ, సామెతలూ వీటి కాధారం. వీటి కో కాలమని ఉండదు. చిర ప్రాణాలు, పరంపరాగతాలు. సంస్కృత కావ్యాల్లో సాధారణంగా కనిపించే విశ్వసత్యాల్లాంటి సూక్తులకు సమానార్థకంగా కనిపించే సామెతలు మనకు చాలావున్నాయి. ఇతర భాషల్లోనూ వుండొచ్చు. జాతి సంప్రదాయంలో వున్న సమానాంశాలే ఈ పోలికలకు కారణం.

## మరోసారి 'వేమన కవి కాదు'

ఇటీవల వేమన పద్యాలమీద సహృదయులు కనబరుస్తున్న ఆసక్తి ఎంతో సంతోషించదగింది. చాలామంది పరిశోధకులు, పరిశీలకులు వేమనను

గురించి కొత్త విషయాలు వేమన పద్యాలకు కొత్త భాష్యాలు చెప్పే ప్రయత్నాలు చేస్తున్నారు. ఇవన్నీ ఆహ్వానించదగినవే.

అయితే ఇప్పటికీ వేమన 'కవికాదు' అనే పాత మాట అక్కడక్కడా అరుదుగానైనా వినిపిస్తున్నది. ఆంధ్రజ్యోతి వారపత్రిక (28-8-1981) సంచికలో అచ్చయిన ఇంటర్వ్యూలో పుట్టపర్తి నారాయణాచార్యులవారు 'వేమన కవి కాదు, నీతిబోధకుడు, గొప్ప thinker, ఫిలాసఫర్' అని సెలవిచ్చారు. కవి కావటానికి మిగతా లక్షణాలకు వైరుధ్యం లేదని చెప్పడం తప్ప దాన్ని గురించి వాగ్వాదం పెంచటం అనవసరం.

ఆంధ్రజ్యోతి వారపత్రిక 16-10-1981 సంచిక ఫిడేలు రాగాల శీర్షికలో The Tense Time అనే తెలుగు కవితల ఇంగ్లీషు అనువాదాల సంకలనాన్ని సమీక్షిస్తూ పురాణం సుబ్రహ్మణ్య శర్మగారు ఆ "కవితా సంకలనం వేమన పద్యాలతో ప్రారంభించటం అనవసరమన్నారు." అంతేకాక "తెలుగు కవిత్వాన్ని సూక్తులు చెప్పేవారు, నీతులు చెప్పేవారు, తత్వాలు చెప్పేవారు, కథలు చెప్పేవారినుంచి రక్షించుకోవాల్సిన అవసరం ఎంతైనా వుంది" అన్నారు. పుట్టపర్తి వారి విమర్శ సందర్భంలో చెప్పిందాన్నే ఇక్కడా అన్వయించుకోవాలి. వేమన పద్యాల్లో కవిత్వం లేదని పూర్వపు ఛాందస పండితులు చేసిన వాదానికి, ఇప్పటి ఈ పండితుల వాదానికి చెప్పుకోదగ్గ భేదంలేదు. వాటికి సమాధానాలు కూడా పూర్వపు రచనల్లోనే వున్నాయి కనుక కొత్త సమాధానాలు అక్కర్లేదు.

"వేమన పద్యాలు సూక్తులలాగా వుండి ఇంగ్లీషులో బాగుండవు" అని కూడా సుబ్రహ్మణ్యశర్మగారు అన్నారు. అనువాదానికి అనుకూలంగా వుండటం కవిత్వానికి ముఖ్య లక్షణం కాదు. పైగా అనువాదంలో ఒక పద్యం బాగుండటానికి బాగుండకపోవటానికి ఎన్నో కారణాలుంటాయి. అవన్నీ ప్రస్తావించటాని కిది సమయం కాదు.

రెండో ముద్రణ ఒట్టి ముద్రణ మాత్రమే కాదని ఈపాటికి పాఠకులు గుర్తించే వుంటారు. నేను నిరంతరం చేసే కొత్త ఆలోచనల అంశాలు ఇందుతో పొందుపరిచాను. మంచి చెడ్డల పరిశీలన పాఠక లోకానిదే.

సంవత్సరం తిరక్కుండానే ఈ పుస్తకం రెండో ముద్రణకు రావటం వేమన్నమీద తెలుగు పాఠకులు చూపుతున్న ఆదరణకు నిదర్శనం. నా కృషిపట్ల పాఠకుల ఆమోదానికి ఒక సూచన.

ఈ పుస్తకం మలిముద్రణ ప్రతిని నాచేత త్వరగా చేయించిన హైదరాబాదు బుక్ ట్రస్టుకు, సంపాదకులకు కృతజ్ఞతాభినందనలు.

—గోపి

నవంబరు - డిసెంబరు 1981.

# రాచరికాలు

అల్పబుద్ధివాని కధికారమిచ్చిన
దొడ్డవారినెల్ల తొలగగొట్టు
చెప్పుదిన్న కుక్క చెరుకు తీపెరుగునా
విశ్వదాభిరామ వినురవేమ

రాజు హీనుడైతే గొప్పవారిని కూడ ఆదరించడు. రాజులంటే ఈసడింపూ, భయమే కాక కొంత వ్యతిరేకతకూడా ప్రజల్లో తలెత్తుతున్న కాలమది.

అల్పబుద్ధి అంటే స్వల్పబుద్ధి, నీచబుద్ధి, క్షుద్రత్వం అని అర్థాలు. నీచుడు తనమట్టూ నీచులనే చేరనిస్తాడు. నిజాయితీపరులను దూరం కొడతాడు. పెంటలమీద పాతచెప్పులను, చీకిపోయిన గుడ్డలను నమలటానికి అలవాటుపడిన కుక్కకు చెరుకురసంలోని మాధుర్యం నాలుకకెక్కదు అంటున్నాడు వేమన.

ఎంత సేవచేసి ఏపాటు పడినను
రాచమూక నమ్మరాదురన్న
పాముకాటి పొందు పదివేలకైనను
విశ్వదాభిరామ వినురవేమ

ఈ రాజులు 'దండసాధ్యులే' కాని 'ధర్మసాధ్యులు' కారు అని ప్రజలు గ్రహించటం మొదలుపెట్టారు. 1662 లో రాయలసీమ గుండ

ప్రయాణంచేసిన Tavernier అనే వజ్రాల వ్యాపారి గండికోట నవాబు ప్రజలను శిక్షించే దారుణ పద్ధతినిగూర్చి వర్ణించాడు. ఆనాడు రాజా తలచిందే ధర్మంగా చెలామణీ అయింది. ఒక్క రాజేకాదు వారి కొలువులోని వారందరూ దారికి తగినవారే. పాముల్లా కాటేసేవారే కాక కోతుల్లా చీకాకు పరచిన వెర్రివెంగళప్పలు కూడా ఆనాడు రాజ్యాలేలారు.

"అల్పబుద్ధివాని కధికారమిచ్చిన" అని పాత తాటాకు ప్రతుల్లో ఉండే "అల్పజాతివాని కధికారమిచ్చిన" అని ఇటీవలి ప్రతుల్లోకి ఎక్కింది.

ఈ మార్పువల్ల వేమన అభిప్రాయాలకు విరుద్ధంగా జాతిభేదం అంటుతుంది. ప్రాచీన కావ్యాలను 'సంస్కరించిన' వారి తప్పుడు భావాలు అసలు కవులకు విరుద్ధంగా అచ్చులో చాలాచోట్ల కనిపిస్తాయి. వేమన్నకు ఇట్లాంటి అపకారం హెచ్చుగా జరిగింది.

పెక్కుజనుల చంపి పేదల వధియించి
డొక్క కొరకు ఊళ్లు దొంగిలించి
ఎక్కడికిని పోవనెరిగి యముడు చంపు
విశ్వదాభిరామ వినురవేమ

నువ్వు పేదలను చంపితే నిన్ను యముడు చంపుతాడు అని వేమన్న హెచ్చరిక. ప్రజలను సంరక్షించవలసిన అధికార్లు పిరికిపందలు కావడం వల్ల ప్రజాకంటకులైన అధికార్లకు అడ్డులేకపోయింది. ఈ అధికార్లు ఎవరో కాదు విజయనగర సామ్రాజ్యం అస్తమించిన నాటినుంచి ప్రజలను హింసించి, దోచుకోటానికి అలవాటుపడ్డ పాలెగార్లు. రాయలసీమను ఆక్రమించిన నవాబులు ఎవ్వరూ ఈ పాలెగార్లను అణచి శాంతిని స్థాపించలేకపోయారు. పాలెగార్లు విజయనగర కాలంలో ఎప్పుడూ కొంత స్థిరసైన్యాన్ని పోషించి, రాజులకు అవసరమైనప్పుడు సైనికసేవ చేసేవారు. విజయనగర

కాలపు పాలెగార్లలో పట్ల వంశపు పాలెగార్లు ముఖ్యులు. వీరు 17వ శతాబ్దంలో సిద్ధవటం కోట నిర్మించారు. విజయనగరం సమసిపోగానే వీరు తమ సైనికబలంతో యధేచ్ఛగా దోచుకొని ప్రజలను నానా అవస్థలకు గురిచేశారు. పాలెగార్లు స్వతంత్రంగా వ్యవహరిస్తూ కేంద్రాధికారాన్ని సాగనివ్వలేదు. దేశంలో అరాచకం తాండవించింది. ఈ బాధలనుంచి విముక్తి చేసే బలవంతుడైన రాజుకోసం ప్రజలు ఎదురుచూశారు. ఈ అరాచకాల అవశేషాలు బ్రిటిషు సామ్రాజ్యం ఏర్పడిన కొంతకాలందాకా వున్నాయి. 19వ శతాబ్దం మొదట్లో కాశీయాత్రకు బయలుదేరిన ఏనుగుల వీరాస్వామయ్యగారు రాయలసీమ, తెలంగాణాలగుండా ప్రయాణం చేస్తూ అప్పటి చిల్లర పాలకులను గూర్చి ఇలా రాశారు: "....ఆ జమీనుదారులకు ఒకరి కొక్కరికి సరిపడక వచ్చినట్లయితే పోట్లాడి చావడం మాత్రమే కాకుండా ఒకరి గ్రామాదులను ఒకరు కొల్లబెట్టి రైతులను హింసించి గ్రామాదులను పాడుచేయుచున్నారు." (కాశీయాత్ర చరిత్ర పేజీ నెం. 24)

ఏ ఉపద్రవం ఎప్పుడొచ్చినా ముందుగా దానికి గురి అయ్యేది పేదలేనన్న విషయం పేదల వధియించి అన్న మాటలవల్ల గ్రహించవచ్చు.

పరబలంబు చూచి ప్రాణరక్షణమున
కురికిపారిపోవు పిరికి నరుడు
యముడు కుపితుడైన అడ్డంబు ఎవరయా
విశ్వదాభిరామ వినురవేమ

17వ శతాబ్దం యుద్ధాలకాలం. 17వ శతాబ్దం మధ్యనాటికే (1645) గండికోట, నంద్యాల, కర్నూలులను ఆక్రమించుకోటానికి మీర్‌జుమ్లా చేసిన యుద్ధాలు; బీజపూర్ మీదికి ఔరంగజేబ్ చేసిన (1657) దండయాత్ర; గుత్తి, తాడిపత్రి, అదోని, ఆలూరు, మడకసిర, ధర్మవరం ప్రాంతాల్లో మొగలు గుఱ్ఱాల రణధూళి ఎగయటం; బీజపూర్ సుల్తానులకు, గోలకొండ

సివాబులకు ఒక్కొక్క ప్రాంతమే కోల్పోతూ, తిరిగి చేజిక్కించుకుంటు దినదినగండంగా విజయనగరం చేసిన కొన ఊపిరి యుద్ధాలూ....ఇట్లాంటి పరిస్థితుల్లో గ్రామాల్లో పాలెగార్ల దుండగాలకు అంతులేదు. ప్రజలకు భద్రత కరువైంది. వేమన్న కాలంలో పాలకులు ప్రజలకు 'పట్టుకొమ్మలు'కాదు. "పెట్టిపొయ్యలేక తిట్టువారె" కాక, ప్రజలకు కనీస రక్షణ నందించలేని అసమర్థులు. పరసైన్యాలు గుర్రాలపై వచ్చి ప్రజలను హింసించి ఊళ్ళను వల్లకాళ్ళుగా మార్చివెళ్ళేవి. అప్పుడు ప్రజలను కాపాడవలసిన అధికారులు పలాయనం చిత్తగించేవారు. శత్రుసైన్యాలు రాకముందే పారిపోయినవార కొందరైతే కదనరంగందాకా వెళ్ళి కాళ్ళకు బుద్ధిచెప్పేవారు కొందరు.

స్వప్రాణరక్షణకోసం పరిగెత్తే పిరికివానికి యముడే ఎదురైతే? అని అడుగుతున్నాడు వేమన్న.

పుడమి నుప్పరంబు పురికొల్పి జగముల
రక్షసేయగల్గు రాజు లెవరు?
మహిపతి యను పేరు మనుజున కేడదో
విశ్వదాభిరామ వినురవేమ.

వేమన దృష్టిలో ప్రజలను రక్షచేసేవాడే రాజు. అది కేవలం పర సైన్యాల నుంచి చేసే ప్రాణరక్షణ మాత్రమేకాదు. ప్రజల జీవనభృతి కోసం రాజ్యంలో ఉన్న వనరులు మరమ్మత్తుచేసి కొత్తవనరులు కల్పించి చేసేరక్షణ. యుద్ధాలకాలంలో అభివృద్ధి కార్యక్రమాలు మూలపడకుండా, రాజవిధిని మరవకుండా "ఉప్పరాన్ని" పురికొల్పేవాడే నిజమైన రాజు. ఉప్పరమంటే చెరువులు మొదలైనవి తవ్వి కాల్వలు తీసి చేసేపని అని వావిళ్ళ నిఘంటువు. ఇళ్ళను కట్టేవారు, సున్నంపని చేసేవారిని ఇప్పుడు ఉప్పరవారంటున్నారు.

రాజులు పిరికిపందలూ స్వార్థపరులూ అయిన వేమన్నకాలంలో వ్యవసాయప్పనులు మూలపడ్డాయి. ఆ కాలంనాటి కరువురాక్షసి కరాళ తాండవానికి చారిత్రకాధారాలే ఉన్నాయి. "రాజు" అనే నిజమైన అర్థంలో నిర్వహణ చేయగలిగిన రాజులు కరువైనారు. రాజ్యంలో నిర్మాణ కార్య క్రమాలను ప్రోత్సహించి చేయించేవాడినే "మహిపతి" అనాలి. ప్రతివాడినీ రాజు అనటం కుదరదు అని వేమన్న వాదం.

పట్టనేర్చు పాము పడగ ఓరగజేయు
చెరుప జూచువాడు చెలిమిజేసు
చంపదలచు రాజు చనువిచ్చుచుండురా
విశ్వదాభిరామ వినురవేమ

రాజులను గూర్చి వర్ణించేటప్పుడు వేమన్న తరచుగా రెండు ఉపమా నాలను వాడతాడు. 1. పాములు, 2. కోతులు. ఈ పోలికలమీద వేమన్న కున్న మక్కువ అతని లోకానుభవంనుండి పుట్టిందే. క్రమంగా ఇవి క్రౌర్యానికీ, చపలచిత్తానికీ బలమైన సంకేతాలయ్యాయి.

కాటు వెయ్యబోయేముందు పాము పడగను ఒక పక్కకు వంచటం లోకవిదితం. వేమనే మరో సందర్భంలో "కరువనున్నపాము నెరిదాచు కొనినట్లు" అని చెప్పాడు.

కరవబోయే పాము పడగను పక్కకువంచి నమ్మిస్తుంది. అట్లాగే చెడగొట్టదల్చుకున్న వాడు ముందు స్నేహం నటిస్తాడు. వీళ్ళిద్దరిలాగే, చంపదల్చుకున్న రాజు ముందు చనువుగా వుంటాడు. రాజులిచ్చే చనువు ప్రమాదకరంగా, చివరికి ప్రాణాంతకంగా పరిణమిస్తుందని బోధించే కథలు మన సంప్రదాయంలో చాలా ఉన్నాయి. ఆ అభిప్రాయాన్నే అనుభ వజ్ఞుడైన వేమన్న పదునైన సంకేతాలతో సూచించాడు. ఏ అమరనాయకు

లనో, చిల్లర దొరలనో దృష్టిలో పెట్టుకొని చెప్పిన పద్యం కావచ్చునిది వారితో వేమన్న స్వానుభవం కూడా కావచ్చును.

పదుగురాడు మాట పాటియై ధర జెల్లు
ఒక్కడాడు మాట ఎక్కదెందు
ఊరకుండువాని నూరెల్ల నోపదు
విశ్వదాభిరామ వినురవేమ

గ్రామపెద్దలు తీర్పుచెప్పే పద్ధతి, ప్రాచీన గ్రామీణ వ్యవస్థలోనే కాక ఇప్పటికీ చూస్తుంటాం. కులం తగాదాలు, భూమి తగాదాలు వచ్చినప్పుడు వీళ్ళు మీసాలు మెలేసుకుంటూ తాపీగావచ్చి కూచుంటారు. వీరి తీర్పుల్లో తరచుగా ధర్మబలంకన్న మందబలానిదే పై చేయిగా ఉంటుంది. అల్లాంటి సమయాల్లో పదిమంది మాటలకే విలువ. ఎక్కడో ఒకడు న్యాయం కేకవేస్తే అది బలహీనంగా అడుగున పడిపోతుంది. అటూ ఇటూ కాకుండా చెడతాడు. ఊరుకునేవాడు ఊరిలో ఉండలేని వాడవుతాడు.

"తగవు చెప్పచోట ధర్మము పలుక"ని ప్రభువులే ఆనాడు ఎక్కువ. వీరి తీర్పులు ఒక్కోసారి ఎటూ తెగవు. ఆలోచించకచేసే స్వార్థనిర్ణయాలే కాని విచక్షణతోచేసే నేర్పు వారికి ఉండేది కాదు. అందుకే వేమన్న వీరినీ వదల్లేదు:

ఆర్ప తీర్పలేని తీర్పరితనమేల
కూర్ప విప్పలేని నేర్పదేల
పెట్టిపోయలేని పట్టి ఖీరములేల
విశ్వదాభిరామ వినురవేమ

భూమి సరిహద్దుల నిర్ణయాలు, అమ్మకాలు, అప్పులు, ఇట్లాంటి వాటిలో సాక్ష్యాలూ యోగ్యతలకంటె పలుకుబడికే ప్రాధాన్యం ఉండేదని

తెలుస్తున్నది. ఈ తీర్పులు తరచుగా అట్టడుగు వర్గాలకు అనుకూలంగా లేవనేది తాత్పర్యం.

దొరల పెత్తనంకింద ఈ రకమైన గ్రామపంచాయితి, కుహనా న్యాయస్థానాలు తెలంగాణా పల్లెల్లో ఇంకా సాగుతూనే వున్నాయి.

కోతి బట్టితెచ్చి కొత్త పట్టముగట్టి
కొండముచ్చులెల్ల కొలిచినట్లు
నీతిహీనునొద్ద నిర్భాగ్యులుందురు
విశ్వదాభిరామ వినురవేమ

అల్పమైన కోతిని పట్టుకొని పట్టంగట్టి పెద్దవైన కొండకోతులు కొలిచినట్లుగా నీతిలేని సంపన్నుడు లేక అధికారిచుట్టూ నిర్భాగ్యులుంటారు.

ఎన్ని శక్తియుక్తులున్నవాడైనా డబ్బు లేనివాడికి దైన్యమే సొత్తు. సామర్థ్యంలో తమకన్న తక్కువవాడైనప్పటికీ ఉన్నవాడో, అధికారం ఉన్నవాడో అయితే బెల్లంచుట్టూ ఈగల్లా మూగుతారు. వాడి అసమర్థతను ధీరలాలిత్యంగా, వాడి స్త్రీలోలత్వాన్ని రాసికత్వంగా, వాడు పారేసే రొట్టె ముక్కలను పరమ దాతృత్వంగా కీర్తిస్తూ బ్రతుకుతారు.

ఈ "నీతిహీనుడు" పాలెగార్ల అండతో పాలించే చంద్రగిరి అర వీటి రాజు అయి ఉండడు. ఎందుకంటే అప్పటికి అతడే నిర్భాగ్యుడు. కడప, కర్నూలులను పిడికిట బట్టిన మొగలాయీల తొత్తు మీర్‌జుమ్లాయో, ఏ గోలకొండ నవాబో అయి ఉంటారు. 17వ శతాబ్దం తొలిపాదంలో కొండవీటి నేలిన గజపతులను వేమన తిట్టాడు (గద్దవంటివాడు గజపతి కాడకో) కానీ ఇక్కడ ఎట్ట ఎదుట కనిపించే రాజులనే ఉద్దేశించి ఉంటాడనుకోవాలి.

కొండముచ్చులు, అంటే మూతి నల్లగా ఉండే పెద్ద కోతులు. కొండల్లో తిరుగుతుంటాయి. కొండెంగలని కూడ అంటారు. "కాత్ర పుట్టము" (డి. 1721, 442) అనే పాఠం కొన్నిచోట్ల కనబడుతుంది కానీ "పటాన్నే" ఇక్కడ ఉచితంగా ఉంది.

భూపతి దయ నమ్మి భూమి చెరచువాడు
ప్రజల ఉసురు తాకి పడును పిదప
ఎగురవేయు బంతి ఎందాక నిలుచురా
విశ్వదాభిరామ వినురవేమ

సేద్యం వదిలేసి భూమిని పాడుబెట్టి రాజు కొలువును నమ్ముకొని వెళ్ళేవాడు బాగుపడడు. ప్రజలకు అన్నంపెట్టే మంచి పనిని మానేసిన వానికి వారి ఉసురు తగుల్తుంది. రాజుల చేయూత బంతిని ఎగురవేయటం వంటిది. అది పైన ఎంతసేపు నిలుస్తుంది? నేలకూలక తప్పదు అంటున్నాడు వేమన్న.

'కృషితో నాస్తి దుర్భిక్షం' అనేది సామెత. కృషీవలుడు నాగలి కింద పెడితే దుర్భిక్ష పరిస్థితులు ఏర్పడతాయి. రైతులు యితర వృత్తులను స్వీకరించటం ప్రాచీన గ్రామ వ్యవస్థ విచ్ఛిన్నమవుతున్నదశలో ఏర్పడింది.

ఉసురు అంటే నిట్టూర్పు, ప్రాణం, బలం, దుఃఖం, గత్తర, చెడు ఫలితం అని అర్థాలున్నాయి. చేసిన దుష్కార్యానికి కలిగే చెడుఫలితం అనే అర్థం వ్యవహారంలో ఉంది.

"భూపతి కృపనమ్మి" అనే పాఠం ఒకటి ఇటీవలి ప్రతుల్లో కనిపిస్తున్నది. దానికంటే డి. 1768 ప్రతి 120 వ పద్యంలోని "భూపతి దయ" బాగున్నది. రెండోపాదంలోని "ప్రజల గోడు తాకి ప్రబల రోయు"

(డి. 1724: 170) అనే పాఠం అర్థదృష్ట్యా బలహీనంగా ఉంది.

కరణ మధముడైన కాపులందరు గూడి
వంగుమంద్రు సుఖము వచ్చినపుడు
బిరుసు కరణమైన బిడ్డలమందురు
విశ్వదాభిరామ వినురవేమ

భూములకు సంబంధించిన వ్యవహారాలు చూసేవాడు కరణం. నాటి రైతుల వ్యవహారాల్లో కరణం ప్రమేయానికి చాలా ప్రాధాన్యముండేది. భూమి కొలతల్లో సరిహద్దు ఏ పరిష్కారాలు చేయించాలంటే కరణమే శరణం. భూమిని కొలవటానికి గడలే (36 అడుగులు) కాకుండా పగ్గాలు, కాలి అడుగులు ("అంజవార") ఉపయోగించేవారు. పగ్గాల్తో కొలిచినప్పుడు మోసానికి అవకాశముండేది.

"మనసు వచ్చినప్పుడు" అని కొన్ని ప్రతుల్లో ఉన్న పాఠం అర్థవంతంగా లేదు. ఎందుకంటే సుఖం వచ్చిందనుకున్నప్పుడు కొంత నిబ్బరమన్నా వస్తుంది. లెక్కచెయ్యకుండా ఉండటానికి "మనసు వచ్చినప్పుడు" అంటే ఇష్టం వచ్చినప్పుడు అనేది వారి స్తోమతకి కుదరదు. ఆనాట కాపు కరణాల పరస్పర సంబంధాన్ని తెలుసుకోవటానికి ఈ పద్యం బాగా పనికి వస్తుంది.

కరణంతో పగ తెచ్చుకుంటే కాపు బతుకు మొలకెత్తదు. ఇప్పటికీ గ్రామాల్లో "కరణం పగ" అని వినపడుతుంది. స్వభావాన్నిబట్టి వేమన్న రెండు రకాల కరణాలను గూర్చి చెప్పాడు. 1. అధమ కరణం, 2. బిరుసు కరణం. కాపులు అధమ కరణాన్ని లెక్కచేసేవారుకాదు. అధికారం చెలాయించే కరణానికి భయపడేవారు. బిరుసుగా వుండే కరణాన్ని చూసి 'అయ్యా నీ బిడ్డలం కరుణించాలి' అనేవారట కాపులు। 'కాపు కరణములను

కావడికుండలు' అంటాడు వేరేచోట. కాపు కరణాల సహకారం ఉంటేనే గ్రామానికి మేలు కలుగుతుంది.

ప్రాచీన గ్రామ వ్యవస్థలో కరణాన్ని కాదని నడిచిన కాపురం దారం లేని గాలిపటం లాంటిది. అదేవిధంగా కాపు లేనిది కరణానికి విలువలేదు. వ్యవసాయ జీవితానికి కరణం ఉపకరణం మాత్రమే. అందుకే 'కరణం గ్రామాభరణం' అన్నాడు సుమతీ శతకకారుడు.

ప్రాచీన గ్రామీణవ్యవస్థలో కరణం ప్రాధాన్యం ఈ పద్యంవల్ల తెలుసుకోవచ్చు. అంతేగాక గ్రామాధికారులు ప్రజలపై పెత్తనం చేసే వారని కూడా తెలుసుంది.

గండడైన దొంగ కవుల సొమ్మెగవేసి
కండ కావరాన కదియ బలిసి
గండుకుక్క వలెను కాటుకు దిరుగును
విశ్వదాభిరామ వినురవేమ

వేమన కాలంలో కూడ భుక్తికోసం హీనులపైన సైతం పద్యాలల్లే కవులుండేవారు. వాళ్ళకాక పని తీరిన తర్వాత కవుల సొమ్ము ఎగవేసే పాపులు కూడ ఉండేవారు. అంకితం పుచ్చుకొని "అదేమయ్యా" అంటే కుక్కల్లా కరవొచ్చేవారు. డబ్బడిగిన మరుక్షణంనుంచి వాడు కవి పాలిటి దోపిడీ దొంగ అయ్యేవాడు. గండడు అంటే సాహసవంతుడు. గండర గండడు అని శూరులకు వాడుతారు. గండడైన దొంగ అంటే రాచదొంగ, పురానా దొంగ అని చెప్పుకోవాలి. కవి శ్రమతో కీర్తిని కొట్టేసినవాడు దొంగకాక మరేమవుతాడు? అందుకే గండుచీమ, గండుపిల్లి, గండుచేప లాగ గండు కుక్క అని ప్రయోగించాడు వేమన.

పద్ధతి వేరైనా ఆనాడుకూడ రచయితలను మోసంచేసే వాళ్ళున్నా రని ఈ పద్యం వల్ల తెలుస్తుంది.

తోటకూరకైన దొగ్గలికైనను
తవిటికైన తవిటి కుడుముకైన
కావ్యములను చెప్పు గండ్యాలు ఘనమైరి
విశ్వదాభిరామ వినురవేమ

దగాచేసే నీచ రసికులను తిట్టి ఊరుకోలేదు వేమన్న. దేబె మొగా... వేసుకొని పదికీ పరకకీ కావ్యాలమ్ముకునే దరిద్రగొట్టు కవుల్ని నిరసించాడు. కవులకు ఆత్మాభిమానం, ఆత్మగౌరవం అవసరమని వేమన్న ఉద్బోధిస్తు న్నాడు. అర్హతలేని అంకితాలు అమ్మకాల్తో సమానం. ఆత్మవిశ్వాసం లేక ...కారానికీ, డబ్బుకీ అమ్ముడుపోయే కవులున్నంతకాలం ఈ బోధకు విలువ వుంది.

ఈ పద్యంలో రెండుసార్లు 'తవిటి' వచ్చింది. మొదటిది తవుడు. రెండవది తవిద ← తమిద. అంటే రాగులన్న మాట. కొన్నిప్రాంతాల్లో తైదలని కూడా అంటారు. 'గండ్యాలు' అన్నదానికి నిఘంటువులు అర్థం చెప్పవు. ప్రజల్లో వెతకాలి. సందర్భాన్నిబట్టి "నీచమైన గొప్పలు చెప్పు కునేవారు" అనే అర్థం ప్రస్తుతానికి చెప్పుకోవొచ్చు. (డి 1727: 54)

'తవుడుకైన తాలు తప్పకైన'. 'తమిద పిండికైన తవిటికైన' అని పాఠాంతరాలు (డి 1723: 579).

# ఆర్థిక భావాలు

భూమిలోన పుట్టు భూసారమెల్లను
తనువులోన పుట్టు తత్త్వమెల్ల
శ్రమములోన పుట్టు సర్వము తానౌను
విశ్వదాభిరామ వినురవేమ

సాంఘిక భేదాలనే ఒప్పుకోని మానవతావాది వేమన్న. ఆర్థిక అసమానతలను మాత్రం సహిస్తాడా? ధనంవల్ల వచ్చే దుర్గుణాలను ఖండించాడు. ధనంతోపాటు మానవతను కూడ అలవర్చుకొమ్మని ప్రబోధించాడు. దానికి ఆయన దాతృత్వాన్ని ప్రోత్సహించాడు. లేనివాడిని ఆదుకోవడం ఉన్నవాడి ధర్మం అని హెచ్చరించాడు.

అయినా సంపదలకు మూలమేమిటో వేమన్నకు తెలుసు. సాగు చేయగా చేయగా భూసారంలోంచి పంటలు పండుతాయి. సంఘర్షణలోంచి సత్యం పుడుతుంది. అలాగే శ్రమలోంచి అన్నీ పుడతాయి.

మానవ సమాజ పురోగతి శ్రమశక్తి మీద ఆధారపడి ఉందన్న సాంఘిక యథార్థానికి సన్నిహితంగా ఉంది ఈ వేమన సూక్తి. సమాజాన్ని నిశితంగా పరిశీలించిన వేమన శ్రమశక్తిని కూడా గుర్తించాడు.

భూమినాది యన్న భూమి పక్కున నవ్వు
ధనము నాదియన్న ధనము నవ్వు
కదనభీతు జూచి కాలుండు నవ్వును
విశ్వదాభిరామ వినురవేమ

కనుచూపుమేర దాకా ఆ భూమి అంతా నాదే అన్నవాన్ని చూసి వాడి కాళ్ళ కింద ఆరడుగుల నేల నవ్వుతుంది. ఎందరి శ్రమ ఫలితంగానో బొక్కసంలో వచ్చి చేరి నాదన్నవాన్ని చూసి డబ్బు గలగలా నవ్వుతుంది. యుద్ధంలో చావుతప్పించుకుని పారిపోయే పిరికిపందని చూసి ఒకనాటికి నా చేతికి చిక్కుతాడు కదా అని మృత్యుదేవత పకాపకా నవ్వుతుంది.

జీవితమంతా ఆనందాన్ని దూరంచేసుకొని ఇనప్పెట్టెలు నింపుతా డొకడు. ఈ లోపల జీవితం ఖర్చయిపోతుంది. ఎందుకు సంపాదించినట్టు? అప్పు డా ధనం నవ్వదా? సమరంలో పారివచ్చేవారు అప్పటికి బతికి బయట పడవచ్చును గాని అసలు చావుని తప్పించుకొని ఎక్కడికీ పోలేరు. వాడిని చూసి యముడు కులాసాగా నవ్వుతాడు. మనిషి అజ్ఞానాన్ని చూసి వేమన్న బాధగా నవ్వుతున్నాడు.

"దానమీయకున్న ధనము నవ్వు" (డి. 1769, 806) అనే పాఠం కనబడుతుంది. ఇది కూడ "ధనం నిలకడలేనితనాన్ని" ధ్వనిస్తూ స్వారస్య యుతంగానే ఉంది మరి:

ధనము లేమి యనెడి దావానలంబది
తన్ను చెరచు మీరిదాపు చెరుచు
ధనము లేమి చూడతలపనే పాపంబు
విశ్వదాభిరామ వినురవేమ

దారిద్ర్యం ఎంత భయంకరమైందో వేమన్నకు బాగా తెలుసు.

పేదరికం కార్చిచ్చు వంటిది. చెట్టూ చెట్టూ రాపిడిపడి పుట్టేది దావానలం. అవసరాల ఘర్షణలో లేచిన నిప్పు బతుకునూ మానవ సంబంధాలనూ కాల్చేస్తుంది. దావానలం రాపిడి పడ్డ చెట్లనే కాదు పక్క చెట్లనీ అడివంతటినీ వ్యాపించి దహిస్తుంది. కాబట్టి పేదరికాన్ని సంఘ విచ్ఛేదకశక్తిగా వర్ణిస్తున్నాడు వేమన. పేదరికం వల్ల అనేక దుర్గుణాలు సంక్రమిస్తాయి. వ్యక్తి భౌతికంగానే కాక మానసికంగా కూడ పతన మౌతాడు. మనిషి శీలానికి చీడ పుడుతుంది. నాలుక మీది సత్యవాక్కులు మాయమైపోతాయి. మనిషి దగాకోరుగా, దొంగగా మారవచ్చు. సంఘానికి పీడగా మారవచ్చు. అతడు చేసే పాపాలు సంఘ శాంతిని భగ్నం చెయ్య వచ్చు. కాబట్టి అందరికీ సమానంగా ధనం ఉండవలసిన సమాజంలో కొంద రికి ధనం లేకపోవటాన్ని తలచుకోటమే పాపం. పేదరికం ఒక వ్యక్తినే కాక సమాజాన్ని కూడా చెరుస్తుందనే సత్యం గ్రహించి వెల్లడించాడు వేమన్న.

"ధనము లేమెవరికి తాళికై ఉండదు." "ధనము లేమి ఘనత దప్పు వేమ" లాంటి పాఠాంతరాలు కనపడుతున్నాయి.

"పేదవాని బాధ పెనుభూతమై ఉండు: ధనము లేక యున్న ధైర్యంబు చిక్కదు." అనేవి పేదరికాన్ని గురించి వేరే చోట చెప్పిన పంక్తులు. ఇదే ధోరణిలో ఆకలిని గురించి చెప్పిన ఓ పద్యం ఉదాహ రించ తగ్గది—

పులి యదెట్టిదన్న భూలోక మృగరాజు
కలి యదెట్టిదన్న కానరాదు
పులియు కలియు కన్న భువి నాకలియె హెచ్చు
విశ్వదాభిరామ వినురవేమ

కులము గల్గువారు గోత్రము గలవారు
విద్యచేత విఱ్ఱవీగువారు
పసిడి గల్గువాని బానిస కొడుకులు
విశ్వదాభిరామ వినురవేమ

'మంచి' కులంలో పుట్టామనుకునేవారు, గొప్పగోత్రంలోంచి వచ్చామనుకునేవారు, విద్యావంతులమని ఉబ్బిపోయి గర్వించేవారు అందరూ అజ్ఞానులే నంటాడు వేమన. నిజానికి వీళ్ళందరూ డబ్బున్నవాడి దాసి కొడుకుల్తో సమానం. డబ్బున్న వాడికి వీళ్ళంతాలోకువే. ఇది గమనించాక జబ్బ చరుచుకోవటం వెఱ్ఱితనం. అన్నింటికి ధనమే మూలమని వేమన్న వాదం! బానిస అంటే దాసి అని అర్థం ఉంది.

కలిగిన మనుజుండు కాముండు సోముండు
మిగుల తేజమునను మెరయుచుండు
విత్తహీనుడెంత రిత్తయై పోవును
విశ్వదాభిరామ వినురవేమ

డబ్బు గలవాన్ని మన్మధునిలా అందగాడంటారు. చంద్రునిలా వెలుగు 'రేడు' అంటారు. సిరిగలవాడు కీర్తికాంతులతో ప్రకాశిస్తాడు, విత్తం చేతిలో లేనివాడు, చేజారినవాడు, నిజంగా ఉత్తమనిషే అవుతాడు.

ధనమున్నవాడినే ప్రపంచం గుర్తిస్తుంది, కీర్తిస్తుంది అంటున్నాడు వేమన్న. కలిగిన మనుజుడు అంటె డబ్బు కలిగినవాడనే అర్థం. రిత్త, రిక్తకు రూపాంతరం. శూన్యం అని అర్థం. డబ్బు లేనివాడు ఏమీ లేనివాడవుతాడు. 'విత్తహీనుడెపుడు ఉత్త సన్యాసిరా' అంటాడు మరోచోట.

లోభివాని చంప లోకంబు లోపల
మందువలదు వేరు మతముగలదు
పైకమడిగినంత భగ్గున పడిచచ్చు
విశ్వదాభిరామ వినురవేమ

పక్కవాడు చస్తుంటే ఒక్క పైసైనా ఇవ్వని లోభివాన్ని చూస్తే చంప బుద్ధి పుడుతుంది. లోభివాన్ని చంపదలచుకుంటే మందుబెట్టి చంపక్కర్లేదు డబ్బడిగితే చాలు చచ్చి ఊరుకుంటాడు.

పాతకాలంలో గిట్టనివాడికి హాని చేయాలనిగాని, వశీకరణం కోసం గాని, మందుపెట్టే పద్ధతి ఉండేది. అది మెల్లగా పని చేసే విషమై ఆరోగ్యాన్ని కుంగదీస్తుంది. ఇప్పటికీ పల్లెటూళ్ళల్లో ఇటువంటివి వింటుంటాం. మతం అంటే మార్గం. లోభిని చంపాలంటే మెల్లమెల్లగా చంపటం కాదు, పైకమడిగితే భగ్గున దీపమారిపోయినట్లు చస్తాడు. పీడా వదులుతుంది అని వేమన్న హాస్యోక్తి. పైకం అంటే a small Copper coin దమ్మిడీ అని బ్రౌన్ అర్థాలిచ్చాడు. ఇప్పుడు నాణేలు, నోట్లు అనే భేదం లేకుండా ధన సామాన్యానికి వాడుతున్నాం. 'డబ్బు' అనే మాటకు కూడా అర్థం ఇట్లాగే విస్తరించింది.

"మంపు లేదు" (డి 1724, 147) అనే పాఠం స్వీకారయోగ్యం కాలేదు. ఎందుకంటే చంపటానికి మందులున్నాయి. కాని పిసినిగొట్టుకు డబ్బడగటమే మంచి మందు.

గంగపారుచుండ కదలని గతితోడ
మురికి పారుచుండు మోతతోడ
దాతయోర్చి నట్లధముడోర్వగాలేడు
విశ్వదాభిరామ వినురవేమ

నిండుగా విశాలంగా పారే నది హుందాగా చప్పుడు లేకుండ సాగి పోతుంది. ఇరుకు కాలవల్లో ప్రవహించే కుళ్ళు నీరు మోతతో ప్రవహిస్తుంది. అదే విధంగా దాతకుండే సహనం, పరోపకార గుణం అధమున్ని కుండవు.

గంగను గంగానది అనే కాకుండ సాధారణంగా శుభ్రమైన నీరు అనే అర్థంలో వాడతారు. 'పచ్చి గంగ కూడ పుట్టలేదు' అని సామెత. గంగ ప్రవహించినంతమేరా భూమిని సస్యశ్యామలం చేస్తుంది. ప్రజలకు తిండి పెడుతుంది. మురికినీరు వాతావరణాన్ని కలుషితం చేస్తుంది. రోగాలకు కారణమౌతుంది. పైగా మోత.

అన్నీ ఉన్న ఆకు అణగి మణగి ఉంటుంది. ఏమీలేని ఆకు ఎగిరెగిరి పడుతుంది అన్న తెలుగు సామెత కూడా ఈ అర్థంలో వాడుకలో ఉంది. ఒట్టి గొడ్డుకు అరుపు లెక్కువ అని పల్లెలో వాడే సామెతకూ అర్థం ఇదే.

పిసినివాని ఇంట పీనుగువెడలిన
కట్టె కోలలకును కాసులిచ్చి
వెచ్చమాయె ననుచు వెక్కివెక్కేడ్చురా
విశ్వదాభిరామ వినురవేమ

ఏ యింట్లోనైనా చనిపోయిన వారికోసం అందరూ ఏడుస్తారు. దహన క్రియ కోసం కాసులిచ్చిన లోభివాడుకూడ ఏడుస్తాడు. కాని వాడు ఏడ్చేది

చచ్చినవారి మీద ప్రేమతోకాదు. చచ్చినందుకు బాధతోనూ కాదు. ఖర్చాయె గదరా! అని మొత్తుకుంటాడు. వెచ్చం అంటే ఖర్చు, ఇంటి వాడకం కోసం చేసే చిల్లర సరుకుల అప్పు అనే అర్థాలున్నాయి. సరసుడవైతే, అంగడి వెచ్చములాడకు.

"వెంగలితో చెలిమి వలదు వినరా" అదే సుమతీ శతక పద్యంలో కూడా "వెచ్చము" అనే మాటకు బహుశా "అప్పు" అనే అర్థం కావచ్చు. హాయిగా నవ్వించే వేమన్న హాస్యచాతురికి ఈ పద్యం తార్కాణం.

పుత్తడి గలవాని పుష్టంబు పుండైతె
వసుధలోన చాల వార్తకెక్కు
పేదవానియింట పెండ్లైన నెరుగరు
విశ్వదాభిరామ వినురవేమ

డబ్బున్నవాడి పిర్రకు పుండైనా అదో పెద్ద వార్త. తొందరగా వార్త కెక్కుతుంది. అంటే ప్రసిద్ధికెక్కుతుంది. పేదవాడి ఇంట్లో పెండ్లి లాంటి పెద్ద శుభకార్యమైతే పక్కవీధి వాడుకూడ పట్టించుకోడు.

డబ్బున్నవాడి చుట్టే కప్పల్లాగ, ఈగల్లాగ చేరతారు. సానుభూతి వచనాలు పలుకుతారు. వాడికి ఏ చిన్న జబ్బుచేసినా ఘనత వహించిన వైద్యులు దిగుతారు. పేదవాడి పెండ్లేకాదు చావుకూడ లెక్కకు రాదు.

పుత్తడికి బంగారం అని అర్థం, అంటే డబ్బు. పుష్టం అంటే వెనుక భాగం. సంస్కృతంలో పృష్ఠం అనేమాట దీనికి మూలం.

తల్లి గర్భమందు తాబుట్టినప్పుడు
మొదలు బట్టలేదు తుదను లేదు
నడుమ బట్టకట్ట నగుబాటు కాదొకో
విశ్వదాభిరామ వినురవేమ

శరీరంలోని వికారాలను దాచటానికీ, వాతావరణం నుంచి కాపాడ టానికే బట్టలు పుట్టాయి కాని అవిప్పుడు హోదాకి గుర్తుగా మారాయి. అందుకే వేమన్న పుట్టినప్పుడు వెంటరాలేదు. గిట్టేటప్పుడు వెంటపోవు కదా, మరి మధ్యలో బట్టలు కట్టట మెందుకు అని ఎగతాళి చేస్తున్నాడు. కట్టే బట్టలవల్ల సౌందర్యం పెరగాలి గాని గర్వంకాదు. దానికన్న నగ్నత్వమే మేలు.

"నడుమ బట్ట కట్టటం నగుబాటు" అన్నా డంటే దిగంబరంగా తిరగాలని వేమన అన్నా డనటం కుదరదు. ఈ పద్యాన్ని బట్టే నగ్నంగా తిరిగాడనే వాదుకలు పుట్టి ఉంటాయి. వేమన బొమ్మ కూడ దీని ఆధారంగానే పుట్టింది.

కాని ఇది కవితారూప దృష్టాంతంగానే తోస్తున్నది. "బతికి బట్ట కట్టాల" అన్న సామెత ప్రకారం బతుకు బట్ట కట్టేట్టుగా ఉండాలనేది వేమన ఉద్దేశం కావొచ్చును. అప్పుడే బట్టలు మనిషికి అందం. మానవ సహజమైన ప్రాథమిక లక్షణాలను వదిలేసి కృత్రిమత్వాన్ని పులుముకోనక్కర లేదని భావం.

బట్ట విడిచి తిరిగే సంప్రదాయం యోగుల్లో, యోగినుల్లో ఉంది. వీర శైవంలో కూడ ఉన్నట్టు దాఖలా లున్నాయి. జైనంలో దిగంబర శాఖ ఉంది. కాని వేమన ఈ ప్రభావాల్తో అన్నాడని నిరూపించటం కష్టం.

ఉప్పు చింతపండు ఊరిలోనుండగా
కరువదేల వచ్చె కాపులార
తాళకం బెరుగరో తగరంబు నెరుగరో
విశ్వదాభిరామ వినురవేమ

ఉప్పు చింతపండు లాంటి కనీసపు తిండిపదార్థాలు ఊళ్ళో సంపన్నులు, రైతుల యిండ్లలో ఉన్నాయికదా! మరి కరువెట్లా వచ్చింది? అని ప్రశ్నిస్తూ తానే అందుకు పరిష్కారం చూపిస్తున్నాడు. వాళ్ళకు ధనాశ పెరిగింది: తాళకం తగరాలతో బంగారం చేసి వాళ్ళ మొహాన పారేస్తే వాళ్ళదాహం తీరుతుంది.

సులభ మార్గాల్లో రాత్రికి రాత్రే ధనవంతులు కావాలనే అత్యాశకు వికృత రూపమీ రసవాదం. వేమన్న కూడ కొన్నాళ్ళీ రసవాదం పిచ్చిలో పడ్డట్టు అనేక పద్యాలవల్ల తెలుస్తుంది. 'తాళకంబెరుగరో తగరంబు నెరుగరో' అంటే ఇవి రసవాద ద్రవ్యాలన్నమాట. తాళకాన్ని రసాయనిక శాస్త్ర పరిభాషలో Arsenic sulphide అంటారు. తగరం Tin. ఈ రెండింటి రసాయనిక సంయోగంవల్ల బంగారు రంగుతో తేలిక లోహం మిగుల్తుంది. Fools Gold అంటారు దీన్ని.

కొన్ని తక్కువ విలువగల లోహాలను రసాయనికచర్య ద్వారా బంగారంగా మార్చవచ్చుననే నమ్మకం భారతదేశంతోపాటు ఇతర దేశాల్లో కూడా ఉండేది. దీన్ని తెలుగులో రసవాదమనీ, ఇంగ్లీషులో 'ఆల్కెమీ' (alchemy) అని అంటారు. ఇట్లాంటి నమ్మకం 17వ శతాబ్దంలోకూడ వుండేది. దొంగసన్యాసులు, గోసాయీలు బంగారం తయారు చేస్తామని ప్రజలను ప్రలోభపెట్టి మోసం చేసేవారు. ఇట్లా రసాయనికచర్య ద్వారా నిజంగా బంగారం తయారయినట్టు ఏ దేశచరిత్రలోనూ ఆధారం లేదు.

"తాళకరసస త్తు తామ్రముల్ రేవకో" (డి 1728; 10) అనేది పాఠాంతరం.

కసువు పసికి జేసెగాలి ఫణికిజేసె
మన్నెరలకు జేసె మరవకిట్లు
భూమి జనులకెల్ల బువ్వట్లు చేసెరా
విశ్వదాభిరామ వినురవేమ

దేవుడు పశువులకు గడ్డినీ, పాములకు గాలినీ, వానపాములకు మట్టినీ ఏర్పాటు చేసినట్టే మనుష్యులకుకూడ ప్రకృతిలో తిండిని ఏర్పాటు చేశాడు. మరి ఇతర జంతుజాలానికి దొరికినట్టు మనుష్యులందరికి తిండెందుకు దొరకదు? అని ప్రశ్నిస్తున్నాడు వేమన.

జంతువులు వేటి ఆహారాన్ని అవి కష్టపడి సంపాదించుకుంటాయి. మనుష్యులే ఒకడి నోరుకొట్టి ఒకడు తింటాడు. ప్రకృతిలో అందరి తిండికీ అవకాశముంది. అందరూ కష్టపడి సంపాదించుకోవాలి అని వేమన్న వాదం. పసి అంటే పశు సమూహం అని అర్థం. పసికట్టేది. అంటే వాసననుబట్టి తెలుసుకునేది పసి. పాములు గాలి మేతలు అనేది కొంత వరకు కవిసమయమే. పాములు ఇతర చిన్న చిన్న జీవుల్ని తింటాయి. ఎర్ర అంటే వానపాము. కుంభిని అంటే భూమి. కుంభినీ జనులు అనటం వల్ల భూమిలోంచే మానవులందరికీ కూడు సమకూరుతుంది అని ధ్వని.

ఇటీవలి ప్రతుల్లోని "కుంభినీ జనులకు కూడట్లు చేసెరా" అనే పాఠం కంటే డి 1727; ప్రతిలోని పై పాఠమే (609) మిగతా పద్యం శైలికి దగ్గరగా ఉంది.

కులమువలన కొంత బలమువలన కొంత
కలిమివలన కొంత గర్వమునను
రంకుచదువు చదివి రంకున బడుదురు
విశ్వదాభిరామ వినురవేమ

మదాంధుడికి కామాంధకారం కూడ తోడవుతుంది. శృంగారం, రాసిక్యం పేర్లతో నీతిహీనమైన జారత్వం నేర్పే చదువులు చదివి విట శేఖరులవుతారు. ఇంతకు వీళ్ళకీ మదం ఎక్కడి నుంచి వచ్చింది? పుట్టుక వల్ల కొంత, అధికారంవల్ల కొంత సంపద నల్ల కొంత వచ్చిందంటు న్నాడు వేమన.

మనిషికి ఆత్మబలం, నైతికబలం ముఖ్యం. కులంవల్లా, సొగటంవల్లా డబ్బువల్లా వచ్చేది నిజానికి బలంకాదు బలహీనతే అని వేమన్న వాదం.

పాగ, పచ్చడమును పైకి కూసంబును
పోగులుంగరములు, బొజ్జకడుపు
కలిగినట్టివాని కందురు చుట్టాలు
విశ్వదాభిరామ వినురవేమ

దాదాపు మూడువంద లేండ్ల కిందట మోతుబరుల వేషరీతిని వర్ణించే పద్యమిది. తలపైనపాగ, ఒంటికి పాము కుబుసంకుచ్చులతో దుప్పటి, చెవులకు పోగులు, వేళ్ళకు ఉంగరాలు, పెద్దపొట్ట ఉన్నవాడి చుట్టూ చుట్టాలు బిలబిలమంటూ మూగుతారంటున్నాడు వేమన్న.

'తెప్పలుగ చెరువునిండిన కప్పలు పదివేలుచేరు' అని సుమతి సామెత. 'కలిగినవాడు' అంటే సంపన్నుడు. వేమన్నే మరోచోట చెప్పిన

పద్యాలవల్ల మరికొంత సమాధానం తెలుస్తుంది.

అనాడు స్త్రీపురుష భేదం లేకుండా పోగులు ధరించేవారు. ధన వంతులు ధరించే పోగులకు ముత్యాలు, రత్నాలు గుచ్చి ఉండేవి. పేదవారి పోగులకు పూస లుండేవి. వీటిని పూసపోగులనేవారు.

ఈతకంటెలోతు నెంచగ పనిలేదు
చావుకంటె కీడు జగతి లేదు
గోచిపాతకంటె కొంచెంబు మరిలేదు
విశ్వదాభిరామ వినురవేమ

ఈదటంవచ్చి ఈదదల్చుకున్నప్పుడు ఎంతలోతయినా లెక్కలోనిది కాదు. చావాలనుకోవటమే దురదృష్టం. దాన్ని మించిన హాని ప్రపంచములో లేదు. గోచిపాతతో తృప్తిపడ దల్చుకుంటే దానికన్న దైన్యం మరోటి లేదు.

జీవన ప్రవాహంలోకి దిగకముందే మీనమేషాలు లెక్కపెట్టేవాడు, సమాజాన్ని ఎదుర్కోకముందే ఆత్మహత్యకు పాల్పడేవాడు, మెరుగైన పరిస్థితుల కోసం ప్రయత్నించక ఉన్నచోటే కూలబడిపోయేవాడు వీళ్ళం దరూ వేమన్న దృష్టిలో పిరికితనానికి మానవరూపాలు.

ఇంటిలోని ధనము ఇదినాది యనుచును
మంటిలోన దాచు మంకుజీవి
కొంచబోడు వెంట గుల్లాకాసైనను
విశ్వదాభిరామ వినురవేమ

కూడ బెట్టిన డబ్బును మట్టిలో దాచినవాడు చివరికి మట్టిలోనే కలసి

పోతాడు. ఆ డబ్బు ఎవరికీ చెందదు. బతికి ఉన్నప్పుడు నలుగురికి పనికి వచ్చేపని చేయనివాడు మంకుజీవి అంటున్నాడు వేమన్న.

అంటే మొండివాడు. అటువంటివాడు చచ్చిపోయేటప్పుడు వెంట కనీసం గుల్లకాసైనా కొంచబోడు (తీసుకపోడు) గుల్లకాసు అంటే గవ్వ. కొంచబోవు అనేది కొనుచుపోవు అనేదాన్ని రూపాంతరం, తీసుకొనిపోవుట అని అర్థం. కొంటబోవు అనే ప్రయోగం కూడ కనిపిస్తుంది. కొంటబోవు, కొంచబోవు రూపాలు ఇప్పటికీ రాయలసీమ తెలంగాణా వ్యవహారంలో ఉన్నాయి.

ప్రాచీన కాలంలోధనాన్ని ముఖ్యంగాకాసులవంటి వెండి, బంగారు నాణాలను భూమిలో పాతిపెట్టి దాచేవారని చరిత్రవల్ల తెలుస్తుంది. ఇప్పటికీ ఆ పద్ధతిని అక్కడక్కడా వింటుంటాము. వేమన్న నాటికేకాక ఆ తర్వాత చాలాకాలందాక గవ్వలు చెలామణిలో ఉన్నాయి. "గజపతింట నెన్నగవ్వలు చెల్లవా!"

"గణకులొప్పియున్న గవ్వలు చెల్లవా!" అని వేమనే వేరేచోట ప్రయోగించాడు. ఆనాడు లోహంతో చేయబడ్డ నాణాలే గాక 'గవ్వ' లకు కూడా మారకపు విలువ ఉన్నట్లు సాక్ష్యాలున్నాయి. అప్పటి ద్రవ్యవ్యాప్తిలో వాటిది కనీస విలువ. ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్రనాటికి కూడా హైదరాబాదు దాకా ఇవి వ్యాప్తిలో ఉన్నట్టు తెలుస్తుంది. ఆయన వాటి విలువను కూడ తెలిపాడు. "వారికి కొన్ని గవ్వలయినా ఇచ్చిపోక పోతే అవమానము తోచుచున్నది. చెన్నపట్టణపు రూపాయకి అక్కడి వయిసాలు 50. పయిసా 1 కి 20 పుంజీల గవ్వలు. పుంజీ 1 కి 4 గవ్వలు" (కాశీయాత్ర పేజీ-34)

ఇప్పుడు 'గవ్వ'లు ఈ అర్థంలో సామెతల్లో మాత్రమే మిగిలిన ట్టున్నది. ఉదా: "చిల్లి గవ్వకు కూడ కొరగాడు."

"ఎంత భాగ్యమున్న అంత కష్టపు చింత" అంటాడు మరో చోట. ధనం కూడబెట్టటంసంఘ వ్యతిరేక చర్య అని తాత్పర్యం.

కనులు పోయినవాడు కాళ్ళు పోయినవాడు
ఉభయు లరయ గూడియుండినట్లు
పేద పేద గూడి పెనగొనియుండును
విశ్వదాభిరామ వినురవేమ

పేదవారు పేదవారితోనే కలవగలరు కాని ఇతరులతో కలవలేరు. వికలాంగులు గుడ్డివారైనా, కుంటివారైనా ఒకరికొకరు ఏ విధంగా సాయ పడతారో పేదవాళ్ళు అదే విధంగా ఒకరికొకరు సాయపడతారు. 'పెనగొని' అంటే కలిసిమెలిసి అని అర్థం. విడదీయటానికి వీల్లేనంతగా కలిసిమెలిసి ఉండాలని భావం. ఈ మాటకు మెలికవేసుకొని అనికూడా అర్థం ఉంది. 'పెన' అంటే మెలిక. 'పెనగడ' లో ఉన్నది ఈ 'పెన'యే.

ఈ పద్యంలో పేదల సంఘీభావాన్ని కోరుతున్నాడు వేమన. కీర్తిస్తున్నాడు.

ధనము కూడబెట్టి ధర్మంబు సేయక
తాను దినక లెన్స దాచుగాక
తేనెటీగ గూర్చి తెరువరి కియ్యదా
విశ్వదాభిరామ వినురవేమ

ధనాన్ని నలుగురికి పంచగలిగిన దాతృత్వమే ఉంటే ఆ ధనం ఒక్కడిదగ్గరే ఎందుకు మూలుగుతుంది? ఎదుటివాడి కష్టసుఖాలను విచారించ

సరిగే మానవత్వమే ఉంటే వాడు అపమార్గాల్లో ఎందుకు సంపాదిస్తాడు? ధనం పిచ్చి పట్టినవాడు తాను తినడు, ఒకరికీ పెట్టడు. 'లెస్సగా దాచుకుంటాడు' ఈ 'ధనం నాది' అనే తలపుతో కులుకుతాడు. "లెస్స" అంటే చాలా అనే అర్థం తెలంగాణా వ్యవహారంలో ఉంది.

భూమి నాదియన్న భూమి పక్కున నవ్వు
దానహీను జూచి ధనము నవ్వు

అని అంటాడు మరోచోట. "రాజులసొమ్ము రాళ్ళపాలు" అన్నట్టు, చివరికి వారసుడు కూడ లేక చస్తారటువంటివాళ్ళు. పువ్వు పువ్వును పీల్చి తేనెటీగ తేనెను కూర్చితే వాటిని తరిమిగొట్టి దానిని ఏ బాటసారులో తీసుకుంటారు. తెరువరి అంటే దారిని పొయ్యేవాడని అర్థం.

కుడువ ముడువలేక కూడు బెట్టగలేక
విడువ నుడువలేక విద్యలేక
నడువ నేరనివాని నడపీనుగందురు
విశ్వదాభిరామ వినురవేమ

కుడువటానికి లేదు అంటే తినటానికి తిండిలేదు. కొప్పు ముడుచుకోటానికి చమురులేదు. తమకేకాదు ఇంట్లో నోళ్ళు తెరిచి కూచున్న పెళ్ళాం పిల్లలకు పెట్టుకోటానికి కూడులేదు. కట్ట విడువ మారు బట్టల్లేవు. వాక్కుతో బతుకుదామంటే మాటకారీతనం లేదు. అమ్ముకోటానికి విద్యలేదు. ఇటువంటి వాన్ని చూపి జనులేమంటారు? 'నడపీనుగ' అంటారంటున్నాడు వేమన్న. నడవ నేరని వాడు అంటే బతకలేనివాడని అర్థము. నడపీనుగ అంటే నడచే పీనుగ. జీవచ్ఛవం అన్నమాట. బతుకుతున్నాడన్న మాటేగాని అది చావుతో సమానం. ఇంటిముందు సజీవమాత్రుడుగా ఉన్న

వాడు అని అర్థం చెప్పుకోవచ్చు. తిక్కన నడమోదువులు, నడదివియలు అని ప్రయోగించాడు. రాజులకు గౌరవసూచకంగా నడదివియలు పట్టు కొంటారు. నడదివియలు అంటే నడవనడవకు (అంటే మెట్టు మెట్టుకి లేక అడుగడుక్కీ) ఒక దీపం అని అర్థం. ఊరేగింపులో పట్టే దివిటీలను నడ దివియలంటారు. సామంతరాజుల కిరీట కాంతులే నడదివియలుగా ధర్మ రాజుకు ఉన్నాయని భారతంలో వర్ణన. సుమతికారుడుకూడ 'నడపీనుగ వచ్చె ననుచు నగుదురు'' అని వాడాడు.

పేదరికాన్ని పేదవాని లోకువతనాన్నీ కళ్ళకు కట్టినట్టు వర్ణించిన పద్యమిది. ఆర్థిక స్థోమతలేని వానిని గూర్చి జనులనుకునే పద్ధతిని ఈ పద్యంలో వేమన చూపించాడు.

పరుల మోసపుచ్చి పరధనమార్జించి
కడుపు నింపుకొనుట కానిపద్దు
ఋణముసేయు మనుజు డెక్కువ కెక్కునా
విశ్వదాభిరామ వినురవేమ

అప్పులిచ్చి పక్కవాన్ని మోసంచేసి పీడించి ధనం కుప్పలు పోసు కోవటం, ఇతరుల కడుపులుకొట్టి తన కడుపు నింపుకోవటం దుర్మార్గమే. అది కానిపద్దు. కాని అంటే పూర్తికాని అనీ అసాధ్యమైన అనీ ఇంగ్లీషు లోని but లాంటి అర్థాలున్నాయి. కాని వేమన్న ఇక్కడ 'కాని' ని 'అను చితం' అనే జాతీయార్థంలో వాడాడు. 'పద్దు' అంటే ప్రతిజ్ఞ అనే అర్థ ముంది. కాని పద్దు అంటే ముందుగా చేసుకున్న వాగ్దానం తప్పటం అన్న మాట. అప్పులిచ్చేవాడు అమాయకులను మోసంచేసే పద్ధతిని వర్ణిస్తున్నాడు వేమన్న. ఇటువంటి వారివద్ద అప్పుచేసే వ్యక్తి నాశనమౌతాడు గాని వృద్ధి కొస్తాడా అని వేమన్న ఆవేదన.

బడుగు నెరుగలేని ప్రాభవం బదియేల
ప్రోది యిడని బంధు భూతి యేల
వ్యాధి తెలియలేని వైద్యుడు మరియేల
విశ్వదాభిరామ వినురవేమ

పేదవాన్ని ఆదుకోలేని సంపదా, వైభవం విలువలేనివే. అండగా నిలబడని, పరస్పర పోషకంకాని బంధువుల ఆస్తులు ఉన్నా లేనట్టే. వ్యాధి ఏమిటో కనుక్కొని తగిన మందివ్వలేని వైద్యుని శాస్త్రపాండిత్యం దండగే.

ధనం ఉండి దయా, ఆర్ద్రతా లేనివాడు బండరాయిలాంటి వాడు. కష్టాల్లో వెలివేయక, సాయంగా వచ్చి వాటిని కడతేర్చేవాడే నిజమైన బంధువు. వ్యాధి ఒకటయితే, మందు మరోటి ఇచ్చే మిడిమిడి జ్ఞాన సంపన్నుడైన వైద్యుడు హంతకునితో సమానం.

పేదవాడు ఐన పెంటినిచ్చెదనని
పైక మడుగరాదు పరుసమునను
పైడిగొనుట పెంటి బట్టిన యట్లయా
విశ్వదాభిరామ వినురవేమ

డబ్బున్నవాడికిచ్చినా, పేదకిచ్చినా ధనదృష్టి ఉంటే మాత్రం అది దుర్మార్గమే నంటున్నాడు వేమన. పెంటి అంటే ఆడపక్షి అని అర్థం. అమ్మాయి అని ఇక్కడ వ్యవహారార్థం. 'పరుసమునకు' అనటంవల్ల నిల బెట్టి పైకం వసూలుచేసే వారని తెలుస్తుంది. పైడికి బంగారమని అర్థం. అంటే డబ్బు. డబ్బు తీసుకొని పిల్లనిస్తే బిడ్డను పట్టినట్లే. అంటే చెరబట్టి నంత పాపం అంటున్నాడు వేమన.

అప్పుడు 'కన్యాశుల్కం' అనే దురాచారం ఉన్నట్టు ఈ పద్యంవల్ల తెలుస్తున్నది.

గ్రాసమింతలేక కడు కష్టపడుచున్న
విద్యయేల నిలుచు వెడలుగాక
పచ్చికుండ నీళ్ళుపట్టిన నిలుచునా
విశ్వదాభిరామ వినురవేమ

తిండిలేక ఆకలితో అలమటించేవాడికి విద్యప్రయోజనాన్ని గురించి చెప్పి లాభంలేదు. బలవంతంగా చదువు రుద్దినా అది ఎక్కువకాలం నిలువదు. "కడు కష్టపడుచున్న" దరిద్రుడికి 'విద్యలేనివాడు వింతపశు' వంటి సామెతలు చెప్పి లాభంలేదు. పచ్చికుండలో నీళ్ళుపోస్తే విచ్చుకపోతుంది. నీళ్ళు నేలపాలవుతాయి. తిండికి కటకటలాడేవాడు కుమ్మరి భట్టిలో కాల్చక గట్టిపడని కుండలాంటివాడు. కనీసపు ఆర్థికస్తోమతలేని వారికి విద్య అబ్బటం కష్టం అన్న పరమసత్యాన్ని వెల్లడించాడు. ఈనాటి ఉచితవిద్య, ఉచిత వయోజనవిద్య మొదలైన ప్రభుత్వ కార్యక్రమాలు విఫలం కావడానికి మూలకారణం ఈ పద్యంలో దొరుకుతుంది.

కూడు వడ్డికిచ్చి కూర్మితోడుత గంజి
తాగునట్టి వోగు తారమైన
పేదసాదలకును పెండ్లికి యిచ్చునా
విశ్వదాభిరామ వినురవేమ

వ్యవసాయ సంస్కృతిలోకి మెల్లమెల్లగా వ్యాపార వాతావరణం ప్రవేశిస్తున్న రోజులవి. స్వయం సంపూర్ణ గ్రామీణవ్యవస్థ పగుళ్ళు వారు

తున్న తొలిదశ. గ్రామ సమిష్టి జీవనంలోని సత్యకాలం క్రమంగా పోతున్నది. ఈవి (దయాధర్మాలు) నశించిన లేమి రోజుల్లో గడపనివారికి అప్పులే శరణ్యమైనాయి. ఆ అప్పులుకూడ అందరికి లభించేవికావు. (పరగ లేమిచేత పరపతి తప్పురా) మధ్యయుగంలో ఉన్న అప్పులు, వడ్డీలు ఎంత దారుణంగా ఉండేవో అబేదుబాయ్ వర్ణించాడు.

చిత్రమేమిటంటే కలిగినవారే కాక కడుపు కట్టుకొని వడ్డీకిచ్చే పేదలు కూడ తయారైనారు. తినబోయే కూడును వడ్డీకిచ్చుకొని గంజిమీద మమకారం పెంచుకొనేవాడు మూర్ఖుడు. అటువంటివాడు పేదలకు పెండ్లి లాంటి మంచి కార్యాలకు కూడ సాయం చెయ్యడు. ఓగు అంటే కీడు అని అర్థం. మూర్ఖుడని అర్థంలో వాడాడు వేమన్న. తారం అంటే నాలుగు కాసుల వెండినాణెం. కాసు అతితక్కువ విలువగల చిన్న రాగినాణెం. బహుశా ఇప్పటి పైసవంటిది కావచ్చును. "కాసు తీర్చలేక మోసపోరా" "చేతికాసులెల్ల చేరదీసు" అని వేమన్న వాడాడు. కాసు, తారం, విజయ నగర కాలంలో వాడుకలో ఉండేవి.

ఒక్క తోలుదెచ్చి ఒరపు బొమ్మను చేసి
ఆడునట్లు చేసి ఆట్టెవేసె
తన్ను దిప్పువాని తానేల కానడో
విశ్వదాభిరామ వినురవేమ

మనిషి తోలుతో అందమైన బొమ్మను తయారుచేసి, కీళ్ళు అమర్చి దారాలుకట్టి వేళ్ళ చివరల్తో ఆడిస్తాడు. కాని నిత్యం తనను ఆడించేవాడెవడో తెలుసుకోలేకపోతున్నాడని ఆశ్చర్యపోతున్నాడు వేమన్న.

భగవంతుడి పరంగా దీనికి వ్యాఖ్యానం చెప్పటం సులభమే కాని

మానవుల కష్టాలకు బాధలకు భౌతిక కారణాలు కూడా తెలిసిన వాడు కాబట్టి ఈ విధంగా చెప్పుకోవచ్చు.

నువ్వాడించే బొమ్మ సంగతి తర్వాత: నువ్వు బొమ్మవే ముందా సంగతి గమనించు అంటున్నాడు వేమన్న. మధ్యయుగంలో మతాధిపతులు, మఠాధిపతులు ప్రజలకు బోలెడన్ని మూఢ నమ్మకాలను సరఫరా చేసి, వారి అజ్ఞానం ఆసరాగా చేసుకొని తమ ప్రయోజనాల కనుగుణంగా ఆడిం చారు. కత్తి మొనల కదలికలకు అనుచాలనంగా రాజులు ప్రజలను దోచు కున్నారు. సంప్రదాయ శృంఖలాలు జీవితం నడకనే మార్చేశాయి. "పీక ల్లోంచి బయటికిరా! జ్ఞాన మార్గాన్ని అవలంబించు" అని చైతన్య శంఖం పూరిస్తున్నాడు వేమన్న. ఒరపైన అంటే అందమైన అని అర్థం. రాపిడి వల్ల మెరుగుదేరటమన్నమాట.

# మతభావాలు

విష్ణుభక్తులెల్ల వెలిబూది పాలైరి
వాదమేల మత విభేదమేల ?
తెలియ లింగధరులు తిరుమంటి పాలైరి
విశ్వదాభిరామ వినురవేమ

మతాలు ఉదాత్తమైన ఆలోచనలతోనే పుడతాయి. కాని త్వరలోనే నిస్తేజమైపోతాయి. ప్రాణంపోయిన శవంలాగ, శైవ, వైష్ణవాలు తాత్త్విక స్థాయిలోనే విభేదించి ఊరుకున్నవి కావు. వ్యవహార స్థాయిలో కూడ అవిరళంగా వివాదపడ్డాయి. శైవులూ, వైష్ణవులూ నిరంతరం పోట్లాడు కుంటూ నాటి సంఘశాంతిని కల్లోల పరిచారు.

వేమన్న వారి భేదాల్లో, వాదాల్లో ఇమిడి వున్న అజ్ఞానాన్ని బట్ట బయలు చేస్తున్నాడు. వైష్ణవుడు చస్తే దహనం చేస్తారు. శైవుణ్ణి పాతి పెడతారు. విష్ణుభక్తులు శివభక్తులను ద్వేషిస్తారు. అంటే బూడిద పూతల శివున్ని ద్వేషిస్తారు. బతికి ఉన్నంత కాలం బూడిదను ద్వేషించిన విష్ణు భక్తులు చచ్చి ఆ బూడిదలోనే కలసిపోయారు. ఇక లింగధారులైన శైవులు నామధారులైన వైష్ణవులతో వివాదపడ్డారు. వైష్ణవుల బొట్టు, తిరుమణి (మణ్ = మన్ను) జీవిత కాలమంతా తిరుమన్నును ద్వేషించినవారు చచ్చి మంటిలోనే కలసిపోయారు? ఇంత వివాదమెందుకు? ఎంత అజ్ఞానం!?

అంటున్నాడు వేమన్న. ఇక్కడ 'పాలైరి' అని 1, 3 పాదాల్లో భూతకాల (జరిగిన కాలాన్ని సూచించే) క్రియా పదాన్ని వేమన యాదృచ్ఛికంగా వాడటంలేదు. ఇట్లాంటి చోట్ల 'పాలవుతారు' సాధారణంగా ఎప్పుడూ జరిగే కార్యాన్ని సూచించే క్రియా పదం వాడటం సాంప్రదాయక పద్ధతి. కాని జరిగిన కాలాన్ని సూచించే క్రియ వాడటంవల్ల అట్లాంటివి ఈ పాటికే జరిగినవి అని చెప్పదల్చుకున్నాడు. జరగబోయే వాటికన్న జరిగిన వాటిని చెప్పటంవల్ల చెప్పదల్చుకున్న విషయానికి బలం చేకూరుతుంది.

మరికొంత వాచ్యార్థంతో ఈ పద్యానికి పాఠాంతరం కనబడుతుంది.

భస్మదూషకులెల్ల భస్మంబు పాలైరి
మంటిదూషకులెల్ల మంటిపాలు
దూషణ ఫలమెల్ల తోడనె చూపెరా

(డి 1723: 775)

కుక్క దిన్నవాడు గురులింగ జంగంబు
పంది దిన్నవాడు పరమ యోగి
ఏన్గుదిన్నవాడు ఎంత సుజ్ఞానిరా
విశ్వదాభిరామ వినురవేమ

శైవ, వైష్ణవాల్లో ఎక్కువగా అబ్రాహ్మణులు, మరీ ఎక్కువగా అస్పృశ్యులు చర్మకారుల వంటివాళ్ళు చేరేవారు. శైవం స్వీకరించగానే లెక్కప్రకారం మధుమాంసాదులు వదిలెయ్యాలి. కాని వాటికి బాగా అలవాటుపడిఉన్న చిన్న కులాల వారికి అది కష్టంగా ఉండేది. కాబట్టి కొంత మంది శూద్రులూ, అస్పృశ్యులూ వాటిని యథేచ్ఛగా ఉల్లంఘించేవారు.

మతాలను మార్చుకోటం, ముఖ్యంగా తమ బలహీనతలకు అనుకూలంగా ఉండే మతాల్లోకి మారటం ఎక్కువగా జరిగేది. ప్రజలు వీరిని హేళనగా చూసేవారు. అదే ధోరణిలో వేమన్న వీళ్ళను వెక్కిరిస్తున్నాడు.

కుక్కదిన్నవాడు, గురులింగ జంగముడైతే, పందినితింటే పరమ యోగి అవుతాడు. మరి పరిమాణంలో పెద్దదైన ఏనుగును దిన్నవాడు ఇంకా గొప్పజ్ఞాని అవుతాడుకదా! అంటున్నాడు. మతం మారితే చాలదు మనస్సు కూడ మారాలంటున్నాడు.

నొసలు బత్తుడయ్యె నోరు తోడేలయ్యె
మనసు భూతము వలె మలయగాను
శివుని గనియెనన్న సిగ్గెట్లు గాదొకో
విశ్వదాభిరామ వినురవేమ

క్తుడిలా నొసట వీభూతి పెట్టుకుంటాడు. మరి తోడేలులా నోరు వెళ్ళపెట్టి ఎప్పుడూ అన్యమతస్థున్ని కరుద్దామా అన్నట్టుంటాడు. మనసునిండా భూతాలు విజృంభిస్తుంటాయి. ఇటువంటివాడు శివున్ని చూశానంటాడు, సిగ్గులేదా అని ఆక్షేపిస్తున్నాడు వేమన.

వేషధారణతో లోకాన్ని మోసగించే శైవుణ్ని పట్టుకుని తిడుతున్నాడు వేమన. బత్తుడు అంటే భక్తుడు. తోడేలు క్రూరజంతువు. బలహీనమైన మేకల్లాంటి సాధు జంతువులను కొరికి చంపి తినేస్తుంది. భూతం అంటే క్షుద్రశక్తి. శైవుడి మనస్సులో భూతనాథుడి (శివుడు)కి బదులు భూతాలు చెలరేగుతున్నయన్న మాట. మలయుటకు విజృంభించుట అని అర్థం.

పద్యయుగంలో శైవులు, వైష్ణవులు తాత్త్వికంగా విభేదించు

క్రోవటం కాక, నిత్యం సంఘర్షించుకున్నారు. శివుడు గొప్ప, విష్ణువు గొప్ప అంటూ పోట్లాడుకునేవారు.

పరమత అసహనం క్రూరంగా ఉండేది. శైవ సన్యాసులు కావిరంగు బట్టలు, రుద్రాక్షమాలలు, ఫాలభాగం, చేతులు మొదలైన భాగాల్లో బూడిద పూసుకునేవారు. వీరి పూజాహేతువులు లింగం, నంది. నిండైన వేషాల్తో ఊర్ల మీదపడి సంఘశాంతిని చెరిచేవారు.

రాతి బసవని గని రంగుగా మొక్కుచు
గునుక బసవనిగని గుద్దుచుంద్రు
బసవ భక్తులెల్ల పాపులు తలపోయ
విశ్వదాభిరామ వినురవేమ

శైవుల పూజాహేతువులు లింగం, నంది. అవి ఎక్కడ కనిపించినా భక్తితో మొక్కుతారు. ప్రాణంలేని శిలానంది కనపడగానే భక్తిప్రపత్తులతో నమస్కరిస్తారు. బండి లాగటానికి ఉపయోగపడుతూ పరిగెత్తే నిజమైన ఎద్దును గుద్దులతో, దెబ్బలతో అదిలిస్తారు. జీవంలేని ఎద్దును మొక్కుతూ, సాక్షాత్తు బసవని అవతారమైన ఆబోతును హింసించే శైవులను పాపులని తిడుతున్నాడు వేమన్న.

బసవడు అంటే ఎద్దు అని అర్థం. బసవభక్తులు అంటే ఎద్దును పూజించేవాళ్ళు అనే చెప్పుకోవాలి. వీర శైవమత స్థాపకుని పేరుకూడ బసవడే. రంగుగా అంటే Finely, gallantly దివ్యముగా అని బ్రౌన్ అర్థాలిచ్చాడు. దివ్యంగా భావించి మొక్కుతారన్నమాట. గునుక బసవడు అంటే మెల్లగా పరిగెత్తే ఎద్దు. గుద్దుట అంటే మొరటుగా ప్రవర్తించటం, కొట్టటం అని అర్థాలు.

జీవులను హింసిస్తూ వాటి ప్రతిరూపాలైన రాయిరప్పలకు మొక్కటం పాపమంటున్నాడు వేమన. ప్రాణిలో శివున్ని చూడలేనివాడు జడంలో చూస్తాడా? ఈ విధంగా విగ్రహారాధనను ఖండిస్తున్నాడు.

కొండరాళ్లు తెచ్చి కోరిక గట్టిన
గుళ్ళలోన తిరిగి కుళ్లనేల
పాయరాని శివుడు ప్రాణియై యుండంగ
విశ్వదాభిరామ వినురవేమ

కొండలు పగులగొట్టి తెచ్చిన రాళ్ళతో గుళ్ళుకట్టి ఆ గుళ్ళకు యాత్రలుగా బోయి ఆ రాళ్ళమధ్యనే శివుడున్నా డనుకోవటం అజ్ఞానం. ప్రాణంతో ఉన్న మనుష్యుల్లో ఉన్న దేవునికోసం ప్రాణంలేని రాళ్ళలో వెతకడమెందుకు అని అడుగుతున్నాడు వేమన.

మానవుడే దేవుడు అంటున్నాడు వేమన. చుట్టూ ఉన్న మనుష్యుల్ని ముందు పట్టించుకోవటం మంచిది. 'పాయరాని శివుడు' అంటే ఎప్పుడూ మానవుడితోనే మానవుడిలో దేవుడుంటాడని అర్థం. మానవత్వమే దేవుడు.

పిండములను చేసి పితరుల తలపోసి
కాకులకును బెట్టు గాడ్దెలార!
పియ్యి దినెడి కాకి పితరుడెట్లాయెరా
విశ్వదాభిరామ వినురవేమ

చచ్చిపోయిన పితృదేవతలకు అన్నం ముద్దలు చేసి పిండాలనే

పేరుతో పెడతారు. వాటిని కాకులు ముడితే ఆ రూపంలో పితృదేవతలు వచ్చారని, తిని తృప్తిపడ్డారని నమ్ముతారు. వేమన ఈ మూఢనమ్మకాన్ని పడదిడుతున్నాడు. "గుడ్డి సంప్రదాయం బరువును మోసే గాడిదలారా! అశుద్ధం తినే కాకిని మీ నాన్న అంటావేమిరా?" అని హేళన చేస్తున్నాడు. తల్లి దండ్రులు బతికి వున్నప్పుడు సుఖపెట్టక చెల్లిపోయిన తర్వాత కల్లబొల్లి కబుర్లుచేస్తే వేమన్న సహించలేదు.

జీవి పోకముందె జీవ వస్తువులిచ్చి
జీవి నిలుప వలయు జీవనముగ
జీవితొలగు వెనుక జీవ వస్తువులేల
విశ్వదాభిరామ వినురవేమ

అని ప్రశ్నించాడు.

విప్రులెల్ల జేరి వెర్రి కూతలు కూసి
సతి పతులను కూర్చి సమ్మతమున
మును ముహూర్తముంచ ముండెట్లు మోసెరా
విశ్వదాభిరామ వినురవేమ

కాదనుకున్నది ఆగకపోవచ్చు. దానికోసం తిథి వార నక్షత్రాలు, ముహూర్తాల మీద ఆధారపడటం అజ్ఞానం. ముహూర్తం ప్రకారం నడిచిన వాళ్ళందరికి సత్ఫలితాలే వస్తున్నాయా? అనేది వేమన్న ప్రశ్న. జాతకాలు చూసి, పేర్లుమార్చి శుభముహూర్తంలోనే పెళ్ళి చేసారుగదా మరి ముండ మోసిందేమిటి? ముహూర్త బలం అడ్డుకోలేదా? దీన్నిబట్టి ముహూర్తం నిర్ణయించేటప్పుడు పెళ్ళిలో చదివిన మంత్రాలు, వెర్రికూతలే కదా!

అంటున్నాడు వేమన. చదివేవాడికేమోగాని వినేవాడికి ఈ మంత్రాల అర్థం తెలియదు.

ఒక్కపొద్దులుండి ఒగి నీళ్ళలో మున్గి
కూడు వండి వేల్పు కుడువమనుచు
దాని నోరుకొట్టి తమరె తిందురుగదా!
విశ్వదాభిరామ వినురవేమ

ఒక్కపూట తింటున్నామనే పేరుతో చన్నీటి స్నానాలు చేసి దేవుడికి నైవేద్యం పెడతారు. తర్వాత దాన్ని వీళ్ళే తింటారు. అదీ దేవుడి నోరు కొట్టి. ఇదంతా ఒట్టి తంతు. ఒక్కపొద్దుకాలంలో మనసునిండా వంటకాలను తలచుకునే వాళ్ళను చూస్తున్నాం. ఒక్కపొద్దు పేరుతో రెట్టింపు చిరుతిండ్లు లాగించేవాళ్ళుకూడ ఉన్నారు. గుడ్డి సంప్రదాయపు బరువుతో తల వంచి దేవుని నోరు కొట్టడానికి వెనుదీయనివాళ్ళు మనుషుల నోరుమాత్రం కొట్టరా? 'ఒగి' అనే మాటకు పటిష్ఠమైన అర్థంలేదు.

ప్రాచీన సాహిత్యంలో, ముఖ్యంగా మౌలిక ప్రధానమైన సాహిత్యంలో ఈ రకపు మాటలు పాదపూరణంకోసం రావటం సాధారణం.

ఆకటికి తొలంగు ఆచార విధులెల్ల
చీకటికి తొలంగు చిత్తశుద్ధి
వేకటికి తొలంగు వెనుకటి బిగువెల్ల
విశ్వదాభిరామ వినురవేమ

ఆకటి చిచ్చులో ఆచారాలు కాలిపోతాయి. ఎవరూ చూడని చీకట్లో

చిత్తశుద్ధి మాయమౌతుంది. ప్రసవించిన స్త్రీకి వెనకటి బిగువు సడలి పోతుంది.

ఆకలి, చీకట్లో కోర్కెలు నిద్రలేవటం, ప్రసవం ఇవన్నీ మనిషికి ప్రకృతి సహజమైనవి. వీటిని తెలుసుకోక చేసేవన్నీ తెచ్చిపెట్టుకున్నవే నంటున్నాడు వేమన్న. ఆచారాలు కాలిపోతున్నాయనే బాధ కాదిక్కడ. ఆకలిముందు అవెంత డొల్లలో చెప్తున్నాడు. ఆకలి అణగారిపోవాలి ముందు. ఆకలి చావులకన్నా ఆచారాలు చచ్చిపోవటమే మేలు అని వేమన్న వాదం—

కడుపులో దుర్భరమైన ఆకలి కాల్తుంటే శుచి శుభ్రతలు పాటించాలా? ఇష్టమైన వంటకాలా? కులం వారిల్లేనా అనే ప్రశ్నలు రావు. వచ్చినా ఆకలికెగిరిపోతాయి. చీకటి కాగానే మనిషి చిత్రంగా మారిపోతాడు. ఎవరూ పసికట్టరనుకున్నప్పుడు వెధవాలోచనలు చేస్తుంది మనస్సు. అప్పుడే మరీ చిత్తశుద్ధి బయటపడేది.

మక్కాకు బోనేల మగుడ తా రానేల
యేకమైన కర్త యిందు లేడో
అన్నిట పరిపూర్ణు డల్లా మహమ్మదు
విశ్వదాభిరామ వినురవేమ

మక్కా, మదీనాల యాత్రచేసి వచ్చినవాడిని మహమ్మదీయులు గౌరవంగా చూస్తారు. కాని అక్కడున్నవాడు ఇక్కడ లేడా? మనసులో లేడా? అన్నిచోట్ల పరిపూర్ణంగా ఉన్న అల్లాకోసం అక్కడికే వెళ్ళిరావాలా?

మూర్ఖత్వాలను ఖండించడంలో వేమన్నకు స్వమత పరమత భేదం లేదు.

కరక కాయలు తిని కాషాయ వస్త్రముల్
బోడి నెత్తి గలిగి బొరయ చుండ్రు
తలలు బోడులైన తలపులు బోడులా
విశ్వదాభిరామ వినురవేమ

సన్యాసులు కామోపశమనానికి ఔషధంగా కరక్కాయలు తింటారు. మోతచేటుగా కావిబట్టలు కట్టుకుంటారు. నెత్తి గొరిగించుకొని ఊరేగుతారు. తలమీద వెంట్రుకలు లేక బోడిగా వుంటారుకాని తలనిండా కోరికలే గదా! అంటున్నాడు వేమన. తలను బోడిచేసుకోవటం కాదు తలపులు మాయం కావాలి అని వేమన్న వాదం. పగలంతా 'పత్తిత్తుల్లా' తిరుగుతూ విరక్తిని బోధిస్తూ రాత్రిపూట సంభోగాల్లో తేలే మిధ్యాయోగులను నిలదీస్తున్నాడు.

వైద్యగ్రంథాల ప్రకారం కరక్కాయ తల్లివంటిది. హితం కలిగించేది. హరీతకీ అంటారు సంస్కృతంలో. సర్వరోగహారిణి కాబట్టి హరీతకీ అంటారు. ఇంద్రియనిగ్రహానికి సన్యాసులు దీనిని వాడేవారట!

తననాటికి ఇంకా మిగిలివున్న శైవ గురువులను గురించి అబేదుబాయ్ ఈ విధంగా రాశాడు: శైవగురువుల (జంగాలు) పట్ల శివభక్తులకు ఎనలేని గౌరవాదరాలు భయభక్తులు ఉండేవి. అతడు యాత్రకు బయలుదేరి తన ఆతిథ్యానికి ఒక ఇంటిని ఎన్నుకునేవాడు. ఆ యింటి యజమాని భార్యతప్ప ఆ యింటి వాళ్ళందరూ ఇల్లు ఖాళీచేసి గురువు బసచేసినన్ని రోజులు వేరేగా నివసించేవారు. ఇంటి యజమాని భార్య అతనికి సేవలుచేసేది. కాని ఆ గురువులు పడుచుభార్య ఉన్న ఇంటినే బసకు ఎన్నుకునేవారట!

రాతి బొమ్మకేల రంగైన వలువలు
గుళ్లు గోపురములు కుంభములును
కూడు గుడ్డ తాను కోరునా దేవుడు
విశ్వదాభిరామ వినురవేమ

వేమన విగ్రహపూజను ఖండించాడు.

రంగు రంగుల గుడ్డలు రాతిబొమ్మ కెందుకు? ఉండటానికి గుళ్ళు గోపురా లెందుకు? తినటానికి కుండల్లో అన్నాలెందుకు? నిజమైన దేవు డెక్కడున్నా నువ్విచ్చే కూడు గుడ్డలమీద ఆధారపడి ఉంటాడా అని ప్రశ్ని స్తున్నాడు వేమన.

కుంభం అంటే దేవుడికోసం అన్నంవండే కుండ అని అర్థం.

కూడు గుడ్డలు కావల్సింది మనిషికి. రాళ్ళసంగతి తర్వాత ముందు మనిషిసంగతి చూడమంటున్నాడు వేమన్న. రాయికంటె మనిషి తక్కువై వాడా అని కోప్పడుతున్నాడు. ఇదే భావాన్ని ఇంకో విధంగా చెప్పాడు ఆధునిక కవి గురజాడ అప్పారావు.

మనిషిచేసిన రాయిరప్పకి
మహిమకలదని సాగిమొక్కుతు
మనుషులంటే రాయిరప్పల
కన్న కనిష్టం!
గాను చూస్తావేల బేలా?

ఆనాటి వేమన పద్యానికీ, నిన్నమొన్నటి గురజాడ గేయానికీ ఇంకా సమాజంలో అవసరం తీరకపోవటం ఆశ్చర్యం!

గంగిగోవు పాలు గంటెడైనను చాలు
కడివెడైన నేమి ఖరము పాలు
భక్తి గలుగు కూడు పట్టెడైనను చాలు
విశ్వదాభిరామ వినురవేమ

ఆవుపాలు కొంచెమైనా, చివరకు గరిటడైనా శ్రేష్ఠమే. గాడిదపాలు కుండ నిండుగా ఉన్నా వాటికి సాటిరావు. నిష్కల్మషమైన విశ్వాసంతో, ప్రేమతో పెట్టే కూడు చేతిలో పట్టేంతయినా తృప్తి కలిగిస్తుంది.

ఆకలితో ఉన్నవాడికి ఆదరంగా పెట్టేది కొంచెమైనా అది షడ్రసోపేత భోజనంతో సమానం. ఎంత పెట్టావనికాదు ప్రేమ ముఖ్యం అంటున్నాడు వేమన. కస్సుబుస్సులతో కడుపునిండా తిండిపెడితే చాలదు. మనసు కూడ నిండాలి. తృప్తికలగాలి. అందుకే 'కూడు' అంటున్నాడు వేమన. పరమాన్నాలు కాకున్న సరేఅని భావం.

వేమన్న నాటికే సమిష్టి గ్రామీణ వ్యవస్థలో పల్లెకు బయటివాడెవడైనా వస్తే పిలిచి తిండిపెట్టే రోజులు అంతరిస్తున్నాయి. వ్యాపారవ్యవస్థలు ఏర్పడిన నేటికాలంలో ఎవరికివారే అయినారు.

"గాడ్దెపాలు" అనే పాఠం ఒక్కపత్రికలోనే వుంది.

(డి. 1725: 701)

గుహలలోన జొచ్చి గురువుల వెదుకంగ
క్రూరమృగ మొకండు తారసిలిన
ముక్తి మార్గమదియె ముందుగా జూపురా
విశ్వదాభిరామ వినురవేమ

మోక్షానికి మార్గం ఉపదేశించే గురువులకోసం అరణ్యాల్లో, కొండ గుహల్లో వెతికి లాభంలేదు. గురువు సంగతి తర్వాత. పులో, సింహమో ఎదురైందా ముందు అదే ముక్తిమార్గం చూపెడుతుంది.

అడవుల్లో, గుహల్లో మునీశ్వరులూ, సిద్ధులూ తపస్సు చేసుకుంటూ వుంటారనీ, వాళ్ళకు మహిమలుంటాయనీ ఒక నమ్మకం. ముక్తికోసం అక్కడెక్కడికో వెళ్ళటం అనవసరమనీ, తనకుతాను స్వయంగా అనుభవాలద్వారా ప్రపంచాన్ని అర్థం చేసుకోవాలని వేమన్న వాదం. ఎవడో గురువు ఇంకొకడికి జ్ఞానం బోధించే పద్ధతికి వేమన్న విరుద్ధం. వేమన్న భౌతిక వాస్తవిక దృష్టికీ, సున్నితమైన హాస్యానికీ, వంగ్యధోరణికీ ఈ పద్యం ఒక మచ్చుతునక.

చిత్తశుద్ధి గలిగి చేసిన పుణ్యంబు
కొంచెమైన నదియు కొదువగాదు
విత్తనంబు మఱ్ఱి వృక్షంబునకు నెంత?
విశ్వదాభిరామ వినురవేమ

వేమన్న ప్రబోధాలు చైతన్యగోళాలై జ్వలించటానికి ఆయన వ్యక్తిత్వంలో రెండు అంతఃశక్తులున్నాయి. దండలో దారంలా, వేమన ప్రతిపద్యంలోను అంతర్లీనమై కొనసాగిన సద్గుణాలివి 1. చిత్తశుద్ధి 2. సాహసం.

చిత్తశుద్ధి ఆయన తత్త్వానికి ఊపిరి. పుణ్యం అనే మాటకు అర్థం రాస్తూ బ్రౌన్ ఈ క్రింది శ్లోకాన్ని ఉదాహరించాడు.

శ్లోకార్ధేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథ కోటిభిః
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనం.

నలుగురికి ఉపయోగపడే పనిచేయటమే పుణ్యం. ఇతరులను పీడించటం పాపం. కాని ఎంత చిన్నమేలైనా హృదయపూర్వకంగా చేస్తే అది అనల్పమే. చాలా చిన్నదైన, పుచ్చులేని, సారవంతమైన విత్తనంలోంచే కదా ఆకాశమంత వృక్షం పుట్టేది!

"పుణ్యంబు"నకు బదులు "ధర్మంబు" (డి 1769; 722) అనే పాఠం కూడ వుంది. "మఱ్ఱివిత్తు ఎంత మఱి వృక్షమెంతయా" (డి. 1773; ... కంటే ఉన్నపాఠమే పాదపూరకం అవసరం లేకుండా అచ్చుపోసినట్టు సరిపోయింది.

స్వానుభూతి లేక శాస్త్ర వాసనలచే
సంశయంబు చెడదు సాధకునకు
చిత్ర దీపమునను చీకటి చెడనట్లు
విశ్వదాభిరామ వినురవేమ

"అనుభవమే శాస్త్రం, మాటలే మంత్రాలు" అనేది సామెత. సంశయం మిగలని స్పష్టత రావాలంటే. సత్యం వెలగాలంటే అనుభవం కావాలి. శాస్త్రజ్ఞానంవల్ల తెలిసిన సంగతులు స్వానుభవంవల్ల కాని అర్థం కావు. శాస్త్రం "ఇది చెయ్యాలి ఇది చెయ్యొద్దు" అని చెప్తుంది. దానిని గుడ్డిగా అనుసరించి లాభంలేదు. సాధనా, అనుభవంలోంచే రావాలి. దానితో మూలకారణం తెలియాలి. అనుభవాన్ని ఆశ్రయించక, శాస్త్రాలమీద ఆధార

పడటం వెలుతురుకోసం చిత్రించిన దీపం ముందు పెట్టుకోవటం లాంటిది. చిత్రదీపం అంటే కాగితంపైగాని, పటంలోగాని చిత్రించబడ్డ దీప రూపం అన్నమాట. అల్లాంటి దీపం చిత్రదీపమేగాని సత్యమైన దీపం కాదంటున్నాడు వేమన. శాస్త్ర వాసనలు అంటే శాస్త్రంవల్ల సంపాదించిన పరిజ్ఞానం. అనుభవాన్ని నమ్ముకో, అసలుసత్యం తెలుసుకో అని వేమన్న వాదం.

మేఘమడ్డమైన మిహిరుని చెరచును
చిత్తమడ్డమైన స్థిరము చెరచు
మరపు లడ్డమైన మరి ముక్తి జెరచును
విశ్వదాభిరామ వినురవేమ

ముసిరిన మబ్బులు సూర్యకాంతిని అడ్డుతాయి. వ్యామోహం జనిస్తే స్థైర్యం చెడుతుంది. చైతన్యరహితమైన జడస్థితి వచ్చినవాడికి బయట పడే మార్గం తెలియదు.

సత్య సాక్షాత్కార స్థితి ముక్తి. చిత్తస్థైర్యమున్నవాడికే అది అనుభూతమవుతుంది. సత్యం, చైతన్యం సూర్యుని వంటివి. వాటిని అజ్ఞానం చాంచల్యం కప్పివేయకుండా చూసుకొమ్మని హెచ్చరిస్తున్నాడు వేమన.

మిహిరుడు అంటే సూర్యుడు. చిత్తమంటే ఇక్కడ చిత్తవిభ్రమనే అర్థం. మరపును చైతన్య రాహిత్యమనే అర్థంలో వాడాడు వేమన

గాజు కుప్పెలోన కడగుచు దీపంబు
ఎట్టులుండు జ్ఞాన మట్టులుండు
తెలిసినట్టివారి దేహంబులందుల
విశ్వదాభిరామ వినురవేమ

గాజు కుప్పెలో జ్యోతి ఎట్లా స్థిరంగా ఉంటుందో దేహంలో చైతన్య మట్లా ఉంటుంది.

కడగుట అంటే కదలికలు లేకుండ స్థిరంగా ఉండటం అని అర్థం. గాలికి దీపం ఆరిపోకుండా దీపం బుడ్డికి గాజు బుగ్గను అమరుస్తారు. మనిషిలో జ్ఞానం లేక చైతన్యం కూడ జ్యోతిలాంటిదే. ఈతి బాధల, వ్యామోహాల నిత్యజీవితంలో ఏ క్షణంలోనైనా అది పలిగిపోవచ్చు. గుండెను చేతులు అడ్డుపెట్టుకొని కాపాడుకోవాలి. దానికి దేహారోగ్యం కూడ ముఖ్యం. రుజాగ్రస్తమైన శరీరంలో మానసిక చైతన్యం నిస్తేజమై పోతుంది. కాని ఆరిపోని జ్ఞానదీపం తాను నిలిచి వెలుగుతూ ఇతరులకు కూడ వెలుగునిస్తుంది.

ఆత్మశుద్ధిలేని ఆచారమది యేల
భాండశుద్ధి లేని పాకమేల
చిత్తశుద్ధిలేని శివపూజలేలరా
విశ్వదాభిరామ వినురవేమ

మనస్సు పవిత్రంగా ఉంచుకోని ఆచారం అపచారమే. శుభ్రంగా లేని పాత్రల్లో వండిన వంట విషంతో సమానం. నిజాయితీ లేని పూజలు నిజంగా వేషాలే.

ఆచారాలు సంప్రదాయంగా వచ్చేవి. వాటిని గుడ్డిగా అనుసరించటం కాదు. అవి ఏ పరమార్థంతో ఉద్దేశించబడ్డాయో తెలుసుకొని నడవాలి. పాత్రల్ని తోమటం పైన తళతళా మెరవటానికికాదు. లోపల పరిశుభ్రంగా ఉండటానికి. 'చిత్తం శివునిమీద భక్తి చెప్పులమీద' అనేది ఇప్పటి సామెత. భక్తికైనా దేనికైనా చిత్తశుద్ధి ప్రాణం అని వేమన్న వాదం.

రెండో పంక్తికి "ద్రవ్య శుద్ధిలేని దానమేల" అనే పాఠాంతరం కన పడుతుంది. (డి 1725; 497). ఇదీ అర్థవంతంగానే ఉంది.

గుణ విహీన జనుని గుణమెంచ్చగానేల
బుద్ధి లేని వాని పూజ ఏల
మనసు లేని వాని మంత్రంబులేలయా?
విశ్వదాభిరామ వినురవేమ

సద్గుణాలు లేనివాని వల్ల ఉపయోగం లేదు. ఏకాగ్రత లేని వాని పూజ పూజకాదు. మనసు స్వాధీనం కానివాని మంత్రాలవల్ల ప్రయోజనం లేదు.

చిత్తశుద్ధి లేక కేవలం తంతుమీద ఆధారపడే, వాడితో వాదించి లాభం లేదంటున్నాడు వేమన. "మనసు నిల్ప శక్తి లేకపోతే మంచి విరుల పూజేమి చేయును" అని సామెత. అన్నింటికి మనసే మూలం. నిజాయితీ ముఖ్యం. బుద్ధిలేని వాడు అంటే 'ఎరుక' 'తెలివి' లేనివాడు అని కూడ చెప్పుకోవచ్చు. 'మనసు లేనివాడు' అంటే ఆర్ద్రత లేనివాడు, కఠినుడు అని కూడ వ్యవహారార్థాలు ఉన్నాయి.

పాల సాగరమున పవ్వళించిన సామి
గొల్లయిండ్ల పాలు గోరనేల?
ఎదుటివారి సొమ్ము ఎల్లవారికి తీపి
విశ్వదాభిరామ వినురవేమ

కృష్ణుడు విష్ణువు అవతారమే. విష్ణువైనా కృష్ణుడైనా ఒక్కడే. శేష పాన్పుమీద పడుకొని పాలకడలిని నివాసం చేసుకున్నవాడు కృష్ణావ తారంలో గోపికల ఇళ్ళల్లో పాలు, వెన్న దొంగతనము చేయటమెందుకు? ఎందుకు అంటే ఎదుటివారి సొమ్ముపైనే అందరికీ దృష్టి ఉంటుందని వేమన్న హాస్యోక్తి. ఈ సత్యాన్ని చెప్పేదే 'పొరుగింటి పుల్లకూర రుచి' అనే సామెత.

కనక మృగము భువిని కలదు లేదనడయ్యె
రామునంత వెర్రి రాజు గలడె
పురము దప్పి పోవ బుద్ధులు నిలువవు
విశ్వదాభిరామ వినురవేమ

ప్రపంచంలో బంగారులేడి అనేది ఉంటుందా అని ఆలోచించడు. నిజంగా రాముడిలాంటి పిచ్చిరాజు ఎక్కడన్నా ఉన్నాడా? ఊరు విడిచి అడవి దారి పట్టినవాడికి సాధ్యాసాధ్యాలను గురించి ఆలోచించే విచక్షణ పోతుంది అంటున్నాడు వేమన. బుద్ధి అంటే will, inclination, mind, advice, sense, judgement అని బ్రౌన్ అర్థాలిచ్చాడు. judgement అనేది ఇక్కడ సరిపోతుంది. పురము దప్పి పోవటమంటే పురం విడిచి పోవటమే. రాముని వెర్రి విచక్షణ లేకపోవడంలోనే కాదు, యౌవనవతి యైన సీతను ఒంటరిగా వదిలి కల్లకనకం వెంటబడ్డాడు. నిజాన్ని వదిలి

భ్రమల వెంట పడటం పిచ్చి అని వేమన్న వాదం.

తాత్త్వికంగా అద్వైత సిద్ధాంతంమీద తిరుగుబాటుగా అనేక ధోరణులు తలెత్తాయి. వాటిలో ముఖ్యమైనవి రామానుజుని విశిష్టాద్వైతం, మధ్వాచార్యుని ద్వైతం. ఈ రెండు కూడ కొంత భేదంతో శంకరుని మాయావాదాన్ని ఖండించి ప్రపంచం యొక్క వాస్తవికతను అంగీకరించాయి. ఇవి అగాధమైన తాత్త్విక చర్చలను నిరాకరించి వేర్వేరు మోతాదుల్లో భక్తి మార్గాన్ని ప్రచారం చేశాయి. ముఖ్యంగా భేదానికి ప్రాధాన్యమిచ్చిన ద్వైతం సహజంగానే కుల విభేదాలకు, కర్మకాండకు తావిచ్చింది. మాధ్వమతం ఎక్కువగా పురాణాదులపైన ఆధారపడిందంటారు. తత్త్వ పిపాసిగా మారిన వేమన్న పురాణ పాత్రలను తర్కంతో అవహేళన చేశాడు.

ఈ పద్యానికి పాఠాంతరాల కొదవ లేదు. మూడవ పాదంలో "తెలివి లేనివాడు దేవుడెట్లాయెరా" అనే ముద్రిత పాఠం ఏ అముద్రిత ప్రతిలోను కనిపించదు. మరి కొన్ని పాఠాంతరాలు:

రాము డెరుకగల్గు రాజుగాడో
చేటుకాలమైన చెడుబుద్ధి పుట్టురా (డి 1723:468)
తలపు కొలదిగాదు దైవికమే గాని (డి 1773-85)

వెర్రిరాజు అనే ప్రయోగం జానపద రామాయణాల్లో "వెర్రి రాముడ"నే వాడుకను జ్ఞాపకం చేస్తున్నది.

# సాంఘిక భావాలు

కులము హెచ్చుతగ్గు గొడవలు పనిలేదు
సాను జాతమయ్యె సకల కులము
హెచ్చు తగ్గుమాట తెల్లెరుంగగవచ్చు
విశ్వదాభిరామ వినురవేమ

నాది పెద్ద కులం, నీది చిన్న కులం అనే గొడవలవల్ల ఫలితం లేదు. అన్ని కులాలు ఒక కులం నుంచే పుట్టాయి. అదే మానవ కులం. హెచ్చు తగ్గులనే మాట చచ్చుమాట.

మానవుణ్ని ఒక కులం చట్రంలో బిగించి ఉంచటం వేమన్నకు నచ్చలేదు. మానవుడు తన సాంఘిక 'వర్ణం' ఏదో ఒకదానిలోనే సభ్యుడై ఉంటున్నాడు కాని తన జాతి మొత్తంలో ఒక స్వతంత్ర సభ్యుడిగా లేడు. ప్రాథమికంగా మానవుడనే గుర్తు కోల్పోయాడు. నైతిక ప్రమాణాల దృష్టితోనే కాదు ఏ ప్రకారంగా చూసినా వర్ణవ్యవస్థ సమర్థనీయం కాదని వేమన్న తేల్చి చెప్పాడు. హెచ్చుతగ్గులవల్ల జాతి ఐక్యతకు మొదటి నుంచీ ముప్పులే. చీటలువారిన భారత జాతికి ఒక సమిష్టి సంస్కృతిలేకుండా పోయింది.

కులము చేతబట్టి గుంపించ నేటికి
పాదు ఉన్నచోట ప్రబలు విత్తు
ఏటి కులంబింక ఎక్కడి ద్విజుడయా
విశ్వదాభిరామ వినురవేమ

కులం చేతిలో ఉన్నవాడు దానిని కులతత్త్వపు ఆయుధంగా వాడు కుంటాడు. అంటే అగ్రకులంలో పుట్టినవాడు ఇతరులపై కత్తుల్లాంటి కితి నోక్తుల్ని గుంపిస్తాడు. గుంపించటం అంటే కుప్పవోయటం, చులకన మాటలు వెదజల్లి నొప్పిస్తాడు అని అర్థం. నేను రెండుసార్లు పుట్టినవాన్ని (ద్విజుడు) అని విర్రవీగుతాడు. కాని రెండుసార్లు పుట్టినా, ఒకసారి పుట్టినా, మానవులందరూ పుట్టేచోటు ఒకటే. అదే పాదు. పాదు అంటే మురికి, కల్మషం అని అర్థాలు.

ఇంతటి నగ్న సత్యం తెలిసికూడ, కులం పుట్టుకతో రాదని గ్రహించి కూడ తోటివారిని అవమానిస్తారు. ఇది ఇప్పటికి ఉండటం ఆశ్చర్యం!

కులము లేనివాడు కలిమిచే వెలయును
కలిమలేని వాని కులము దిగును
కులము కన్న మిగుల ధనము ప్రధానము
విశ్వదాభిరామ వినురవేమ

కులంలేని వాడంటే కులం తక్కువ వాడని అర్థం. డబ్బుంటే ఎంత చిన్నకులం వాడైనా గౌరవింపబడతాడు. అట్లాగే డబ్బులేనివాడి అగ్ర వర్ణం వివర్ణమే. అందువల్ల 'ధనమే కులం కన్న ముఖ్యమైన విలువ' అంటున్నాడు వేమన్న.

బహుశా వృత్తుల మూలంగా ఏర్పడిన కులాలు తర్వాతర్వాత ఘనీభవించి మానవుల మధ్య భేదాలను శాశ్వతం చేశాయి. 17 వ శతాబ్దంలోని పరరాజుల దండయాత్రలు, మహమ్మదీయ మత ప్రభావం, వ్యాపార సంస్కృతి ప్రవేశం మొదలైన అనేక కారణాల వల్ల వర్ణవ్యవస్థ పునాదుల్లో ప్రకంపనాలు మొదలైనాయి. కులవృత్తులను విడిచిపెట్టి ఇతర వృత్తులను చేపట్టేవారు ప్రబలిపోయారు. ఎక్కువడబ్బు సంపాదించే వృత్తులవైపే మొగ్గు చూపారు. కులానికి కర్మను నిర్ణయించే శక్తి సన్నగిల్లింది. ప్రాపంచిక సుఖాల కోసం కులం గోడలను కూలదోసి మళ్ళీ ఆ శిథిలాలకు కాపలా కాసే ద్వంద్వాన్ని పరిహసిస్తున్నాడు వేమన్న.

కులాలను ఖండించిన వేమన్నే మరోచోట కులాన్ని పాటించే పద్యాలు చెప్పాడనీ, తన మాటలను తానే వ్యతిరేకించుకున్నాడనీ కొందరు ఈ క్రింది పద్యాన్ని ఉదాహరిస్తారు.

కులములోన నొక్క గుణవంతుడుండెనా
కులము వెలయు వాని గుణముచేత
వెలయు వనము లోన మలయజంబున్నట్లు
విశ్వదాభిరామ వినురవేమ

కాని, వాళ్ళవాదం అట్టేసేపు నిలవదు. ఇక్కడ కులం అంటే కుటుంబం అనే వ్యవహారార్థమేనని స్పష్టంగా తెలుస్తుంది. కులం అంటే కుటుంబం, వంశం అని అర్థాలు కూడా ఉన్నాయి.

మాలవానినేల మరిమరి నిందింప
ఒడలనున్న మాంస మొకటిగాదె
వానిలోన వెలుగు వాని కులంబేది
విశ్వదాభిరామ వినురవేమ

కులాల పరిస్థితి ఇట్లుంటే మరో సాంఘిక శాపం అస్పృశ్యత. చతుర్వర్ణాలకు వెలిగా పుట్టిన అస్పృశ్యత సాంఘిక అధర్మానికి ప్రత్యక్ష చిహ్నం. ఇటువంటి చోటుల్లోనే వేమన్న తర్కాయుధం పదునుతేరుతుంది. "మాలవాడిని" "మరి మరి" చులకన చేసే "మర్యాద" పరుడా! వాడి ఒంట్లో ఉన్న మాంసం, నీ మాంసం ఒక్కటి కాదా? వాడి కులం సరే, వాడిలో ఒకడు వెలుగుతున్నాడు వాడి కులమేది? వాడెవడో కాదురా "మానవుడు" అంటున్నాడు వేమన్న. మనిషిలో మనిషిని దర్శించలేని అజ్ఞానాంధులే, హీనులే కులాలతో కుప్పిగంతులు వేస్తారు.

మాల మాలగాడు మహిమీదనే ప్రొద్దు
మాట తిరుగు వాడు మాలగాక
వాని మాలయన్న వాడెపో పెనుమాల
విశ్వదాభిరామ వినురవేమ

ప్రవర్తనవల్లనే మాల కావాలి కాని జన్మచేత ఎవడూ మాల కాదని వేమన్న వాదం. మాట 'తిరుగువాడు', మాట తప్పేవాడే మాల. అస్పృశ్యతను పాటిస్తూ, శాస్త్రాధారాలతో దొంగ తర్కాలు చేసేవాడే మాల. మాల కాదు పెనుమాల! రెండు పాదాలవరకు ఏదో వాదనకు పూనుకున్న వేమన్న కోపం మూడవ పాదంలో తారాస్థాయికి చేరుకుంది. కవికి సాత్త్విక గుణం, కోమల హృదయం ఉండాలని వాదించేవారికి ఈ కోపంలో ఉన్న

అపార కృపా తరంగాలు అర్థం కావు. వేమన్నది స్వార్థంలోంచి పుట్టిన ఆక్రోశం కాదు. మానవుడు మానవుడిగా మనలేకపోతున్నాడే అనే ఆవేదన లోంచి పుట్టిన పొలికేకలివి. తోటి మనిషిని అనాదరించేవారు 'నరపశువులు' అని కూడ పడదిట్టాడు వేమన్న.

ఇట్లాంటి అభిప్రాయాన్నే గురజాడ అప్పారావుగారు ఇంకోవిధంగా

'మంచి అన్నది మాల అయితే
మాలనే అగుదున్'

అని చెప్పారు.

మాల మాంసము దిన మహిమీద జనులెల్ల
కొవ్వు తావలేదొ కోర్కెదీర
కులములన్ని ఒక్క కులముగా దెలియుడీ
విశ్వదాభిరామ వినురవేమ

మాలలు మాంసాహారులని చీదరించుకునేవాళ్ళను మీరు తినే నెయ్యి మాత్రం కొవ్వు కాదా అని నిగ్గదీసి అడుగుతున్నాడు వేమన్న. ఆహార పద్ధతుల వల్లనే కులాల హెచ్చు తగ్గులు నిర్ణయమయ్యేట్టయితే మీరు కూడ మాలలే అని వేమన్న రణధ్వని. అందరిదీ ఒకే కులం, మనిషి కులం. ఇట్లాంటిదే మరో పద్యం చూడండి.

కసువు నేరి తిన్న పసరపు మైదిని
మాలడండ్రు వాని మహిని జనులు,
పంది కోడి దిన్న ప్రాజ్ఞుడందురు జనుల్
విశ్వదాభిరామ వినురవేమ

పైగా సహజంగా చచ్చిపోయిన పశువును తినటం జీవహింస

కాదు. చంపి జీవులను తినే ఇతర వర్ణాల వారికన్నా మాలలు గొప్పవారు అంటూ తర్కించే పద్యాలు కూడా వేమన్నలో ఉన్నాయి.

వర్ణభేదం, కులాహంకారం ఒక్క బ్రాహ్మణుల్లోనే ఉన్న దురాచారం కాదు. అంటరానికులాల విషయంలో పై కులాలవారి ప్రవర్తన కూడా దుర్మార్గమైనదే. అంటుకోదగిన బ్రాహ్మణేతర కులాలవారు కోడి, పంది మాంసాలు తింటారు. అంటరానివారు అవు, ఎద్దు, బర్రె మాంసాలు తింటారు. పశువులు (ఆవు మొ॥) గడ్డి తింటాయి. కోళ్ళు, పందులు, పురుగులు పెంటా తింటాయి. గడ్డిమేసే జంతువుల్ని తినే వాళ్ళు అంటరాని వాళ్ళయి అశుద్ధాన్ని గతికే జంతువుల్ని తినే వాళ్ళు అంటరాని వాళ్ళయి అశుద్ధాన్ని గతికే జంతువుల్ని తినేవాళ్ళు వివేకవంతులు (ప్రాజ్ఞులు) ఎట్లా అయ్యారు? అని వేమన తర్కసహజమైన వాదన.

మాలవాని నంటి మఱి నీళ్ళ మునిగేరు
మాలకర్మ చేత మాలడయ్యె
ఏల తెలియలేరొ యీ నరపశువులు
విశ్వదాభిరామ వినురవేమ

వేమన్న దృష్టిలో మాలను ముట్టుకొని నీళ్ళలో మునగటమే మాల కర్మ. పశువులు దిగటంవల్ల నీళ్ళు మురికి అవుతాయి. నరపశువులు దిగినా అంతే. కుల వ్యవస్థ ఖండన వేమన్నతోనే పుట్టలేదనీ 4, 8 శతాబ్దాల్లోని తంత్ర సంప్రదాయాలు కులాన్ని వ్యతిరేకించాయని చారిత్రక పాండిత్యం ప్రదర్శించవచ్చు. 11,12, 13 శతాబ్దాల్లోని ఆధారాలు చూపెట్టవచ్చు. శైవ వైష్ణవాల కులభేద నిరసనను దృష్టాంతాలుగా పేర్కొనవచ్చు. బ్రహ్మనాయుడి "చాపకూడు"ను రోకటిపాటగా ఆలాపించవచ్చు. కాని ఇవేవీ కుల నిర్మూలన కోసం వేదనతో, కోపంతో వేమన్న వేసిన పొలికేకల ప్రాధా

న్యాన్ని తగ్గించలేవు. ప్రాచీన కాలాల్లో ఆయామతాల కులవ్యతిరేకతకు ప్రత్యేక కారణాలు లభిస్తాయి.

హెచ్చు తగ్గుల్లోని అమానుషత్వాన్ని గుర్తించి తీవ్రమైన భావావేశంతో, అపారమైన మానవతాదృష్టితో చేసిన విమర్శలు వేమనవి. అదే ఆయన ప్రత్యేకత.

ఉర్వి వారికెల్ల నొక్క కంచము బెట్టి
పొత్తు గుడిపి కులము పొలియజేసి
తలను చెయ్యి బెట్టి తగనమ్మ జెప్పరా
విశ్వదాభిరామ వినురవేమ

పల్నాటి కాలంలో బ్రహ్మనాయుడు అన్ని కులాలకు కలిపి "చాపకూడు" పెట్టించాడు. నానాకుల సహపంక్తి భోజనమన్నమాట. గురునానక్ 'లంగరు' అనే వాటిని స్థాపించి ఇదేపని చేశాడు. వేమన్నకూడ ఉర్వివారందరూ ఒక్క కంచంలో 'పొత్తుకుడుస్తారు' అంటే కలసి తింటారు. ఆ పని ఊరివారు, ఉర్వివారు చేస్తే కులాన్ని 'పొలియ' జేయవచ్చునంటాడు. 'పొలియజేయట' మంటే నాశనం చెయ్యటం అని అర్థం. ఒక కంచంలో తినటమంటే కలసి తినటంలో భేదాలు పాటించకపోవటమని అర్థం. అంతే గానీ అందరూ ఒకే కంచంలో తిని ఎంగిలి పాటించకపోవటం కాదు. ఇట్లాంటి అర్థానికి ఏ మత సంస్కరణల్లోకూడ ఆధారాల్లేవు. ఒక్క కంచంలో తినటమేకాదు ఆ సందర్భంగా 'ఈనాటినుంచి నాలో కులతత్త్వం చచ్చింది' అని ప్రతివాడు తలమీద చెయ్యిపెట్టుకొని ప్రమాణం చెయ్యాలంటాడు. తలమీద కుడిచెయ్యి పెట్టి దీక్ష నివ్వటం వీరశైవదీక్షా విధానంలో కనపడుతుంది. కలసి తిన్నతరువాత చేతి ఎంగిలితోబాటు కులం మురికినికూడ మనసులోంచి కడిగేసుకోమంటాడు. గుండెమీద చెయ్యి

పెట్టుకోవటం ధైర్యానికి గుర్తైతే తలమీద చెయ్యి పెట్టుకోవడం నిజాయితీకి చిహ్నం. కుల నిర్మూలన అని నినాదాలు చెయ్యటం కాదు. "తగనమ్మ" చెప్పు అంటే ఉత్తుత్తి మాటలు చెప్పకు అంటాడు. లోలోపలి నుంచి కులాన్ని రూపుమాపుకొమ్మంటున్నాడు వేమన.

ఇప్పటికీ చిన్నపిల్లలు, పల్లెటూళ్ళ వాళ్ళు నెత్తిన చెయ్యిపెట్టుకొని 'అమ్మతోడు, దుమ్ముతోడు' అని ప్రమాణాలు చేస్తుంటారు. ప్రమాణమనే మాట వాడకుండా జాతీయంద్వారా ప్రమాణం చెయ్యటాన్ని సూచించాడు వేమన.

కలిమి జూచి యివ్వ క్రయమిచ్చినట్లుండు
సమున కివ్వ మంచి సరస గుణము
పేదకివ్వ మనువు పెనవేసినట్లుండు
విశ్వదాభిరామ వినురవేమ

కయ్యమైనా వియ్యమైనా సమానమైన వాడితో చెయ్యాలని సామెత. వియ్యం మాత్రం ధనవంతుడి కంటె పేదవాడితోనే బలంగా ఉంటుందని వేమన్న చెప్తున్నాడు. డబ్బుచూసి పిల్లనిస్తే అమ్ముకున్నట్టే. అది ఏమాత్రం మంచి పద్ధతి కాదు. సమానమైనవాడి కివ్వటంలో కొంత ఔచిత్యముంది. సరసత ఉంది. అది పరవాలేదు. అయితే పేదకిస్తేమాత్రం ఆ బంధం పెనవేసినట్లుంది. పేదకు కష్టాలు తెలుసు. ప్రేమ తెలుసు. నీ పిల్లను పువ్వుల్లోపెట్టి చూసుకుంటాడంటున్నాడు వేమన. క్రయం అంటే అమ్మకం అని అర్థం. ఇట్లాంటి పద్యాల్లో పేదలపట్ల వేమన పక్షపాతం కూడ తెలుస్తుంది.

కన్యాశుల్క దురాచారం గురజాడ కాలంలో లాగ బ్రాహ్మణుల్లో మాత్రమేకాక అన్ని వర్గాల్లో ఉన్నట్టున్నది. ఓలి అంటారు దీన్ని. ఈ

పద్ధతివల్ల పేద యువకులకు పెండ్లవటం కష్టమై యువతులు శ్రీమంతుల భార్యలయ్యేవారు, వృద్ధులైన సరే. వేమన్న బాల్య వివాహాల్నికూడ ఖండించాడు. ముసలి మొగుడికి పడుచుభార్య ప్రమాదకరమనే పురుషపక్షపాతమే ఈ ఖండనలో కనిపిస్తుంది. వేమన్న ప్రగతివాద దృక్పథంలో ఇదో వెనుకంజ. మేనరికంలాంటి రక్తసంబంధాల్ని కాదని ఓలికోసం జరిగే "అల్లి అమ్మకం" దారుణాన్నీ, డబ్బుముఖం చూడక సమానస్థాయితో చేసే వివాహం బలవ తరమని వేమన్న వాదం.

కామి గానివాడు కవిగాడు రవిగాడు
కామిగాక మోక్షకామిగాడు
కామియైన వాడు కవియౌను రవియౌను
విశ్వదాభిరామ వినురవేమ

మోక్షంమీది అత్యధిక కాంక్షతో తృతీయమైన కామపురుషార్థాన్ని అడుక్కి తొక్కరాదంటున్నాడు వేమన.

కోరికలు లేనివాడు భావాలులేని కవిలాంటి 'వాడు' తేజస్సులేని సూర్యునిలాంటివాడు. నిత్యజీవితంలో కోరికల సుడిగుండంలో పడి కొట్టుమిట్టాడే వాడికే ఒకనాటి జీవితతత్త్వం అంతు చిక్కుతుంది. మోక్ష పరమార్థం అవగతమవుతుంది. జీవితంతో సంబంధంలేని సర్వసంగ పరిత్యాగాన్ని వేమన్న ఖండిస్తున్నాడు.

కామం అంటే స్త్రీ పరమైన వాంఛ అనేకాదు. కోరిక, జీవితంమీది మమకారం అనికూడ అర్థం చేసుకోవాలి. విచ్చలవిడి కామం అన్నింటికీ చేటు. సంసారపరిధిలో ఉండే కామమే పురుషార్థాల్లో చెప్పింది.

సుగుణవంతురాలు సుదతియై యుండిన
బుద్ధిమంతులగుచు పుత్రులొప్ప
స్వర్గ మేటికయ్య సంసారి కింకను
విశ్వదాభిరామ వినురవేమ

వేమన్న కేవలం దోషైకదృష్టి (Negative) గల వ్యంగ్యకవి అనటంలో సబబులేదు. మాయమర్మాలు లేని, లోకంలో నాకాన్నిదించే, కుటుంబవ్యవస్థను ఆయన ఆకాంక్షించాడు.

మంచిగుణం కలిగిన భార్యా, చెప్పింది అర్థం చేసుకుని పాటించే కొడుకులూ ఉంటే ఇల్లే స్వర్గంకాదా అంటున్నాడు వేమన్న. సుగుణవంతు రాలు అంటే కష్టసుఖాలను సమంగా పంచుకుని చేదోడు వాదోడుగా ఉండే దని అర్థం చెప్పుకోవచ్చు. సుదతి అంటే చక్కని పలువరుస గలదని అర్థం. అంటే ఎప్పుడూ చిరునవ్వులు చిందిస్తూ ఆహ్లాదకరంగా ఉండేదన్న మాట. నిజానికి స్వర్గమెక్కడో లేదు, ఇక్కడే ఉంది. ఇక్కడే ఉండాలి అంటున్నాడు వేమన్న.

వేమన పరలోకపు విలువలకన్నా ఇహలోకపు విలువలకే ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చాడు. ఇహలోకాన్ని విస్మరించే తత్త్వశాస్త్రాన్ని వేమన తత్త్వవిరుద్ధం. భౌతిక సుఖజీవనమే స్వర్గంకన్నా మిన్న అని వేమన్న వాదం.

గుణవతి యగు యువతి గృహము చక్కగ నుండు
చీకటింట దివ్వె చెలగురీతి
దేవి యున్న యిల్లు దేవార్చన గృహంబు
విశ్వదాభిరామ వినురవేమ

చీకట్లో దీపంలాగ బాధ్యత తెలిసిన ఇల్లాలి ఇల్లు ఊరికి ఆదర్శంగా ఉంటుంది. అట్లాంటి ఇల్లాలు దేవి. ఇల్లు ఆలయం.

'చీకటింట' అంటున్నాడు వేమన్న. ఇది గ్రామవ్యవస్థ విచ్ఛిన్నతను తెలియజేస్తుంది. వేర్పాటు ధోరణులు, ఉమ్మడి కుటుంబం చెదిరిపోవటం. ఇట్లాంటి సమయంలో ఎక్కడ ఓ యువతి ఉమ్మడికుటుంబంలో సర్దుకుపోయినా ఆమె గుణవతి, దేవి.

వ్యక్తుల స్వార్థాలు కుటుంబాన్ని విచ్ఛిన్నం చెయ్యటం వేమన్నకు నచ్చదు. కుటుంబవ్యవస్థ భగ్నంకావటం అతని కిష్టంలేదు. అందుకే స్త్రీల ప్రసక్తి వచ్చినప్పుడు వేమన్న ఉదాత్తమైన అభిప్రాయాలు చెప్పడు. దీని వల్లే వేమన్న స్త్రీ ద్వేషి అని వ్యాసాలు వెలువడ్డాయి. ఒకానొక చారిత్రక సంధ్యలో ఒక వ్యక్తి ప్రతిస్పందనలుగానే వీటిని స్వీకరించాలి తప్ప సమాజంనుంచి వేరుచేసి చూడకూడదు.

గురము అనే మాట గృహమునకు బదులుగా వాడాడని బ్రౌన్ రాశాడు. తాటాకుల్లో గృహమే ఉంది. యతికోసం లేఖకుడో, పండితుడో చెయి చేసుకున్నాడని బ్రౌన్ గమనించలేదు.

తల్లిదండ్రి మీద దయలేని పుత్రుండు
పుట్ట నేమి? వాడు గిట్టనేమి
పుట్టలోని చెదలు పుట్టదా? గిట్టదా!
విశ్వదాభిరామ వినురవేమ

భద్రతకు పేరుగాంచిన ప్రాచీన కుటుంబవ్యవస్థ బీటలువారుతున్న కాలమది. అందరు కలసికట్టుగా ఉండే ఆ ఉమ్మడి కట్టడిలో సమిష్టి కుటుంబమే సర్వత్రా ఆచరణీయంగా ఉండేది. ఉమ్మడికుటుంబం నుంచి వ్యష్టికి వేరుపడే ధోరణులు తలెత్తాయి. వేర్పాటు పద్ధతులను భార్యలు ప్రోత్సహించేవారు. 'పెళ్ళం' మాటలువిని వేరుబడేవాడు వెర్రివాడు, అని వేమన్న చాలచోట్ల వాపోతాడు. పెళ్ళికాగానే వేరుపడి తల్లి దండ్రుల పోషణభారాన్ని వదిలించుకొనే వాడిమీద విరుచుకుపడుతున్నాడు వేమన్న.

ఏ కాలంలోనైనా కని పెంచి పెద్దచేసిన తల్లి దండ్రులను మరచి పోయ్యే వాడు కృతఘ్నుడే. గ్రామవ్యవస్థ విచ్ఛిన్నమౌతున్న దశలో దాని లోని కొన్ని మంచి విలువలుకూడ నాశనమౌతున్నప్పుడు వాటిని సమర్థిస్తూ అనేక సామెతలు పుట్టాయి.

"తల్లికి కూడుబెట్టనివాడు తగుదునని తగవు చెప్పవచ్చాడు"

"తల్లిచస్తే నాటుక చచ్చినట్లు, తండ్రిచస్తే కళ్ళు పోయినట్టు" "తల్లి దైవం తండ్రి ధనం." "తల్లిని నమ్మినవాడు ధరణిని నమ్మినవాడు చెడడు."

వృద్ధాప్యంలో తల్లిదండ్రులను దయగా చూడనివాడు పుట్టినా పుట్ట నట్టే. ఉన్నా చచ్చినట్టే. పుట్టచెదలు పట్టినదాన్నల్లా నాశనం చేస్తాయి. తల్లి దండ్రులను చూడని పిల్లలు చెద పురుగులని తిడుతున్నాడు వేమన.

గిట్టుట అంటే, సహించటం, పడటం, చావటం అని అర్థాలున్నాయి. ఇక్కడ చావటమనే అర్థం.

అలివంక వారు ఆత్మబంధువులైరి
తల్లివంకవారు తగినపాటి
తండ్రివంక వారు దాయాది పగవారు
విశ్వదాభిరామ వినురవేమ

ఎంతటి బంధువులైన డబ్బుదగ్గరి కొచ్చేసరికి అంతే సంగతులు! నిత్య జీవితంలో మన సంబంధ బాంధవ్యాలు ఆర్థిక సూత్రాలనుబట్టి నడుస్తున్నాయని వేమన్న లాంటివాడు చెప్తే నివురును ఊదేసి నిప్పును చూసినట్టుగా ఉంటుంది. అత్తగారిల్లంటే అల్లుడికెప్పుడూ ఆశే. అత్తింటినుంచి ఎవరొచ్చినా మర్యాద చేస్తాడు. కట్నం కానుకలిచ్చే వాళ్ళు కదా! మేన మామలు పరవాలేదు. కాని అత్తింటి తర్వాతే. పాటి అంటే విలువ, ప్రమాణం అని అర్థాలు. ఇక తండ్రి వైపువారు పాలివారు. పాలుపంచుకు పోయేవారు. కాబట్టి శత్రువులు. దాయభాగం అడిగేవాడు దాయాది.

కల్లుద్రావువాడు కల్లు ముచ్చునుగాడు
కల్లలాడు వాడు కల్లుముచ్చు
కల్లుద్రావు కన్న కల్లలాడుట కీడు
విశ్వదాభిరామ వినురవేమ

కల్లుతాగటం తప్పు. చెట్టెక్కి విడుచుకొని దొంగతనంగా తాగటం మరీ తప్పు. కల్లుతాగే ప్రతివాడు కల్లుదొంగ కాదు. కాని కల్లలాడేవాడు కల్లుదొంగతో సమానం. అబద్ధాల్తో కొంపలు కూల్చేవాడికంటె కల్లు తాగేవాడు నయం అంటున్నాడు వేమన్న.

మత్తుపదార్థాలు సేవించటం ఒక వ్యసనం, బలహీనత. వాటికి లొంగిన వాడినే అది నాశనం చేస్తుంది. కాని కల్ల మనస్తత్వం ఉన్నవాడు

ఎదుటివారికి హానిచేస్తాడు. కాబట్టి కల్లు తాగటం, కల్లలాడటాల్లో రెండోదే ఎక్కువ ప్రమాదకరం.

కాసుముచ్చు, గొర్రెముచ్చు, నాలిముచ్చు, మునిముచ్చు, లొట్టిముచ్చు మొదలైన మాటలు లోకంలో వాడుతున్నారు. వేమన్న 'కల్లుముచ్చు' పై వాటిలో భాగమే కాని ఇతరత్రా ఇట్లాంటి ప్రయోగం కనపడదు.

ఇంటియాలి విడిచి ఇల జారకాంతల
వెంట దిరుగువాడు వెర్రివాడు
పంట చేను విడిచి పరిగెయేరిన యట్లు
విశ్వదాభిరామ వినురవేమ

వేమన పద్యాల్లో వేశ్యాజీవితంలోని లోతుపాతులను తెలిపే వాతావరణం ఉండటం వల్లనే అతడు తొలిదశలో వ్యభిచారం జరిపాడని ఊహిస్తున్నాం. కాని నాకు దొరికిన అయిదువేల పద్యాల్లో ఏదోరకంగా విట జీవితాన్ని సమర్థించే పద్యం ఒక్కటికూడా కనిపించదు. పైగా అనేకపద్యాల్లో వేశ్యాలోలత్వాన్ని నిరసించాడు. ఇది మలిదశలో జరిగి ఉండాలి.

ఇంట్లో పెళ్ళాన్ని వదిలేసి బయట జారస్త్రీల వెంటబడేవాడు నిజంగా పిచ్చోడే. తన చేలో పండిన పంటను కాదని పక్కచేలో పరిగెలేరుకోవటం పిచ్చికాక మరేమిటి? పరిగ యేరటమంటే చేలో కోసినపైరును మోపులుకట్టి తీసికెళ్ళిన తరువాత రాలిన వెన్నుల నేరుకోవటం. పూర్ణానుభవాన్ని తోసివేసి, భ్రమల వెంట పరిగెత్తడమన్న మాట.

ధర్మార్థ కామ మోక్షాల్లో వేమన కామాన్ని ఎప్పుడూ చిన్నచూపు చూడలేదు. "సతిని పెనుగువాడు సంసారయోగిరా" అన్నాడు. కాని ప్రేమ, వలపు ముఖ్యం: అభాసాల వెంటపడటం అజ్ఞానమే నంటున్నాడు.

ఒక కవి ప్రతిభ కొత్తపోలికలోను వాడటంలోనూ ఉంటుంది. క
పరిశీలనాశక్తిని ఇవి చూపుతాయి. ఈ పద్యంలో పోలిక కవి చేసిన జీవి
పరిశీలనలోంచి వచ్చింది.

# వివిధ విలువలు

మేడిపండు జూడ మేలిమై యుండును
పొట్ట విచ్చి చూడ పురుగులుండు
పిరికి వాని మదిని బింక మీలాగురా!
విశ్వదాభిరామ వినురవేమ

చెట్టుమీదున్న మేడిపండు కిందినుంచి చూడ్డానికి కాల్చిన బంగారంలా ఎర్రటి కాంతులీనుతూ కనిపిస్తుంది. తెంపి రెండుగా విడదీసి చూస్తే పురుగులు లుకలుక లాడుతుంటాయి. అట్లాగే సమయం వచ్చినప్పుడు ..శాయి కొట్టేవాడి పిరికితనం బయటపడుతుంది.

మేలిమి అంటే మేలిమి బంగారం అని అర్థం. బింకం చూసి మోస పోకు. అసలు స్వరూపం అవగతం కావాలంటే సన్నిహితంగా చూడాలి. దానికి సమయమూ, సందర్భమూ రావాలి అంటున్నాడు వేమన. "మెరిసే దంతా మేలిమి కాదు" అన్నది సామెత. పిరికితనం చాలా అసహ్యకర మైంది. మంచితనం, సౌమ్యత అనే ముసుగుల్లో పిరికితనం దాచుకుంటారు. గాంభీర్యాన్ని పులుముకొని ప్రవర్తిస్తారు. 'పిరికి వారికే పిడికెడంత మీసాలు' అన్నట్టుంటారు. అందుకే పిరికి గుండెని, పురుగులుపడ్డ మేడి పండుతో పోలుస్తున్నాడు వేమన.

పాఠాంతరాలు: మేడిపండుచూడ మేనెర్రనై యుండు (డి 1721; 342), బీదవాని హృదయబింక మీలాగురా (డి 1725; 451).

ఇనుము విరగనేని ఇనుమారు ముమ్మారు
కాచి యతుక నేర్చు కమ్మరీడు
మనసు విరిగెనేని మరి యంట నేర్చునా
విశ్వదాభిరామ వినురవేమ

ఇనుమే కాదు ఏ లోహమైనా రెండవసారి, మూడవసారి విరిగితే కూడ కాల్చి కరిగించి అతకొచ్చు. కాని మనసు విరిగితే అతకటం మాట అటుంచి అంటకట్టటం కూడ సాధ్యంకాదు. అతుకు, అంటు మాటలు వాడటంలో వేమన్న సామర్థ్యం కనిపిస్తుంది. ఇనుము విరిగితే అతుకు ఆనవాలు లేకుండా అతకొచ్చు. కాని విరిగిన మనసు ముక్కలను కనీసం ఒక్క దగ్గర చేర్చి అంటకట్టటం కూడ వీలుకాదు. మనసు మెత్తనిదే, కరిగేదే కాని ఒక్కసారి విరిగితే అతకని విచిత్రపదార్థం. వేమన్న మనసెరిగిన వాడు.

వేమన్న కోమల హృదయానికి ఈ పద్యం పరాకాష్ట. వేమన్న పెళుసు మాటలు వ్యక్తులను గాయపరచటానికి కాదు, వ్యవస్థను గడగడలాడించటానికి. హృదయాలను గాయపరచే గుణం వేమన్న పద్యాల్లో లేదు. వేమన్న విసిరిన రాళ్ళు కరడుకట్టిన మకిలి పొరలను భేదిస్తే గగ్గోలు పడేవాళ్ళకే అలా కనిపిస్తుంది.

మిరెపుగింజ చూడ మీద నల్లగనుండు
కొరికిచూడ లోన చురుకు మనును
సజ్జనులగువారి సార మిట్టులనుండు
విశ్వదాభిరామ వినురవేమ

మిరియం చూడడానికి పైన నల్లగా ఉంటుంది. కాని కొరికి చూస్తే

గాని సారం, కారం తెలియదు. సజ్జనులూ అంతేనంటున్నాడు వేమన్న నల్లని శరీర వర్ణం చూసి మనిషిని విలువ కట్టరాదు. తెల్లని మనోగతాన్ని చూడాలి. మిరియం పోలిక తెచ్చి వేమన్న వర్ణ, జాత్యహంకారాలను నిరసిస్తున్నాడు.

ఇప్పటిదాకా "మిరపగింజ చూడ మీద నల్లగ నుండు" అన్న ప్రసిద్ధ పాఠాన్నే చదువుకుంటున్నాము. కొన్ని తాటాకు ప్రతుల్లో, అచ్చు ప్రతుల్లో ఈ పాఠముంది. బ్రౌన్ కూడ "మిరపగింజ" అన్న పాఠాన్నే తీసుకున్నాడు. వేమన్న వాదం మొదటి ముద్రణలో కూడ ఆ పాఠమే ఉంది. దీని ఆధారంగా వేమన్న కాలానికి మిరపకాయలంటే మిరియాలేననీ, 15వ శతాబ్దం చివర వాస్కోడిగామా చిల్లీ దేశం నుంచి మన దేశానికి తెచ్చేదాకా మిరప పంట మనకు తెలియదనీ వ్యాఖ్యానాలు వెలిశాయి.

ఈ మధ్య మళ్ళీ ప్రాచీన ప్రతులు తిరగేస్తుంటే డి 1723 ప్రతిలో "మిరెపుగింజ" పాఠం కనిపించింది. (పద్యం నెం. 350). మిరియాలను మిరెసు అని వాడటం ఉంది. కాబట్టి పద్యాన్ని దిద్దుకోవలసిన అవసరం కలిగింది.

ఉప్పు కప్పురంబు ఒక్క పోలికనుండు
చూడ చూడ రుచుల జాడవేరు
పురుషులందు పుణ్య పురుషులు వేరయా
విశ్వదాభిరామ వినురవేమ

'ఓ తెలుగు పద్యం చదువు' 'ఉప్పు కప్పురమైనా సరే' అని తెలుగు వాళ్ళు మాట్లాడుకోవటం రివాజు. వేమన పద్యాలు ఒకటో రెండో రాని తెలుగువాళ్ళు చాల తక్కువ. వచ్చిన వాటిలో ఉప్పు కప్పురం మొదటిదవు

తుంది. అంత ప్రసిద్ధ పద్యమిది.

ఉప్పూ కర్పూరం రెండూ ఒక్కలాగే తెల్లగా ఉంటాయి. కాని నాల్కమీద వేసుకుని చూస్తే రుచులు వేరుగా ఉంటాయి. ఉప్పు ఉప్పగా ఉంటే, కర్పూరం చేదుగా, ఘాటుగా వుంటుంది. చూట్టానికి ఇద్దరు వ్యక్తులు ఒక్కలాగే కనిపించవచ్చు. కాని వారితో కలిసి మెలిగితే గాని తెలియదు వారిలో పుణ్యపురుషు డెవడో.

'చూడ చూడ' అనటంవల్ల నోట్లో వేసుకోగానే తెలిసే రుచి కాదిది. 'రుచుల జాడ' అంటే కర్పూరం నోట్లో వేసుకోగానే ముందు ఘాటుగా, తర్వాత చేదుగా అనిపిస్తుంది. 'జాడ' అంటే మార్గమని అర్థం. కర్పూరం అంటే పచ్చ కర్పూరం, రస కర్పూరం, ఆరతి కర్పూరం అని రకాలున్నాయి.

పచ్చ కర్పూరాన్ని తాంబూలంలో వేసుకుంటారు. దీని పేరే పచ్చ కర్పూరం గాని ఇది తెల్లగా ఉంటుంది. వేమన దీనినే ఉద్దేశించాడు.

"పురుషులొక్కరూపు పుణ్యపురుషులు వేరె" (డి 1723; 948) పాఠం బాగాలేదు.

చెప్పులోని రాయి చెవిలోని జోరీగ
కంటిలోని నలుసు కాలిముల్లు
ఇంటిలోని పోరు ఇంతింతగాదయా
విశ్వదాభిరామ వినురవేమ

సాధారణంగా వేమన్నకు ఇల్లంటే సమాజమే. సమాజంలో అడుగడుగునా ఆటంకాలే. చికాకులే. చెప్పులో చిక్కిన రాయి నడవనియ్యదు చెవి దగ్గరి జోరీగ చేరితే ఒకటే రొద. చెవిలో దూరితే పొడిచి రక్తం

కళ్ళు జూస్తుంది. కంటిలో నలక పడితే కళ్ళకలకంతమంట. పైగా దేన్ని స్పష్టంగా చూడనియ్యదు. కాలికి ముళ్ళు విరిగితే ప్రాణాంతకం. వెళ్ళిందో లేదో తెలియదు. మంట, తీపులు. తాను చెయ్యదలచుకొన్న పనికి ఇంట్లో నుంచే వ్యతిరేకత వస్తే అది నిత్య బాధ. 'ఇంటిలోని పోరు' అనగానే భార్య పెట్టే పోరు అని స్ఫూర్తి ఉన్నా కుటుంబ వ్యవస్థలో అది ఎవరి దగ్గర నుంచైనా కావచ్చు. అన్నదమ్ములు, తల్లిదండ్రులు, తండ్రి అన్నదమ్ములతో సహా కుటుంబ వ్యవస్థలో భాగమే. వీటి పోరు ఇంతింత గాదు అంటే వర్ణనాతీరం అని అర్థం.

చెప్పు విడిచి రాయిని తొలగించి తొడుక్కోవాలి. చెవి దగ్గర జోరీగను రొద మొదలుపెట్టగానే తరిమెయ్యాలి. నలుసు పడితే నలుపుకున్నవాడి కన్నే చెడుతుంది. ఒడుపుతో తీసెయ్యాలి. ముల్లును ముల్లుతో తియ్యాలి. అట్లాగే ఇంట్లో పోరును కూడా కారణం తెలుసుకొని తెలివిగా పరిష్కరించుకోవాలి. ఈ పైన చెప్పిన పోరులన్నీ బాధాకరమైనా కొద్దిపాటి వివేకంతో సర్దుకోగలిగినవి కావటం విశేషం. ఇవన్నీ తాత్కాలికంగా అసౌకర్యాన్ని కలిగించేవి మాత్రమే. వీటిని తొలగించుకోటం కూడా తేలికే.

వేరు పురుగుచేరి వృక్షంబు చెరచును
చీడపురుగు చేరి చెట్టు చెరచు
కుత్సితుండు చేరి గుణవంతు చెరచురా!
విశ్వదాభిరామ వినురవేమ

వేళ్ళకు పట్టిన పురుగు ఎంతటి పెద్ద మానునైనా కూల్చేస్తుంది. ఆకులకు పట్టే చీడ చెట్టును బలహీనపరిచి చెట్టును నశింపజేస్తుంది. మంచివాడి పంచన చేరిన నీచుడూ అంతే, మంచివాడి అంతం చూస్తాడు.

వేళ్ళ ద్వారా వృక్షం ఖనిజాలు, నీరు మొదలైన ఆహారాల్ని గ్రహిస్తుంది. వేరు పురుగు చేరితే వేరుమండలం నశించి చెట్టు మోడై కూలిపోతుంది. ఆకు పురుగులూ, కొంత పురుగులూ మొదలైనవి చీడలు. ఇవి ఆకులను తినేస్తాయి. దానివల్ల చెట్టుకు సూర్యకిరణాల నుంచి ఆహారం తయారు చేసుకునే శక్తి నశిస్తుంది.

కుత్సితుడు తెలియకుండా కీడు చేస్తాడు. వేరు పురుగు చేరితే చెట్టు మోడైదాకా తెలియదు. ఆకులో ఆకులా, ఆకుకు అలంకారంగా ఉంటూనే చెట్టును పాడుచేస్తుంది చీడ. కుత్సితుడూ అంతే స్నేహితుడిలా ఉంటూనే ద్రోహం చేస్తాడు. వేమన్న దృష్టాంతాలు ఊహలో నుంచి కాకుండా జీవితానుభవాల్లో నుంచి వచ్చినట్లు చెప్పటానికి ఇట్లాంటి పద్యాలెన్నో తార్కాణాలు.

చంపదగిన యట్టి శత్రువు తన చేత
చిక్కెనేని కీడు సేయరాదు
పొసగమేలు చేసి పొమ్మనుటే చావు
విశ్వదాభిరామ వినుర వేమ

వాడిని చంపటానికి తగినంత కారణం ఉంది. చంపదగినవాడె, నీ చేతిలో చిక్కాడు. ఏం చెయ్యాలి? చంపమంటున్నాడు వేమన. కాని ఎట్లా? వాడి కేదయినా సాయం చేసి భద్రంగా పంపాలి. అదే వాడికి చావు.

అన్ని వేళలా కాదు గాని కొన్నిసార్లు క్రూరుడికి మేలు చేయటమే శిక్ష. ఇంతటి ఉన్నత ధర్మాన్ని ఏ మతాలు బోధించాయి? వేమన సుతిమెత్తని హృదయానికీ, క్షమాగుణానికీ ఈ పద్యం పరాకాష్ఠ. అంతేకాక సంఘంలో ద్వేషం పనికిరాదంటున్నాడు. చంపవలసింది శత్రువును కాదు శత్రుత్వాన్ని. దానిని చంపటానికి మేలు చెయ్యటమే మార్గం. చంపదగిన

వాడికి ప్రాణదానం కానుకగా ఇవ్వటమే శిక్ష. వేమన్నది కఠిన ప్రవృత్తి అనేవారికి ఈ పద్యం వేమన్న వ్యక్తిత్వంలోని మరో కోణాన్ని చూపిస్తుంది. మాటల్లో కాదు మెత్తదనం ఉద్దేశంలో ఉండాలి.

"పొమ్మనుటే చావు"కు బదులుగా 'చాలు' ప్రచారాని కెక్కింది. మద్రాసు ఓరియంటల్ లైబ్రరీలోని చాలా ప్రతుల్లో 'చావు' పాఠమే ఉంది. బ్రౌన్ 1929 నాటి పుస్తకంలో 'చావు' పాఠమే స్వీకరించాడు. వ్రాతగాళ్ళ తప్పుల వల్లనో ముద్రణ దోషం వల్లనో అచ్చు పుస్తకాల్లో 'చాలు' పాఠం ప్రచారంలో కొచ్చింది. (చూ॥ ప్రతులు డి. 1723—25, 1769) ఓరియంటల్ మ్యానుస్క్రిప్ట్స్, లైబ్రెరీ, మద్రాసు.)

నిప్పలోనబడ్డ చినుకు ముత్యంబాయె
నీళ్ళబడ్డ చినుకు నీళ్ళగలసె
ప్రాప్తము గలచోట ఫలమేల తప్పునో
విశ్వదాభిరామ వినురవేమ

స్వాతి చినుకులు కోటానుకోట్లు కురుస్తాయి. కాని ముత్యపుచిప్పలో పడ్డ ఒక్క చినుకే ముత్యమౌతుంది. మిగిలినవన్నీ అపార జలరాశిలో అనామకంగా కలసి వ్యర్థమౌతాయి. ఇది కవిసమయం, బహుశా కొందరి నమ్మకంకూడా. దొరికిన అవకాశాన్ని వినియోగించుకుంటే మంచి ఫలితాలు వస్తాయని చెప్పటమే ఈ కవిసమయంలోని స్వారస్యం.

ప్రాప్తము అంటే దొరికినంత అని అర్థం చెప్పుకోవచ్చు. సముద్రం మీద కురిసిన చినుకులు నీళ్ళలో నీళ్ళైపోయాయి. అల్పమైన ముత్యపుచిప్ప పేరటి గర్భంలో చిక్కుపడి కూడ ఈ చినుకు ముత్యమై బయటికి వచ్చింది. ఏ కార్యానికైనా దేశకాలాల స్థితినిబట్టి ప్రాధాన్య - అప్రాధాన్యాలు ఉంటాయని ఈ పద్యం తాత్పర్యం.

చీమకుట్టనేని చివుకు మనిపించును
చీమయెంత దాని జీవమెంత?
చీమవంటివారి సృష్టిలో నెరుగరా?
విశ్వదాభిరామ వినురవేమ

చీమ చిన్నదనీ, దాని ప్రాణ మెంతటిది అనీ అనుకోకు. నలుసంత ఆ చీమ కుడితే ఆ మంటకు ప్రాణం చివుకు మంటుంది. ఆ చీమలాంటి మానవులు సృష్టిలో ఉన్నారు తెలుసుకో అంటున్నాడు వేమన.

ఆకారాన్ని చూసి విలువ కట్టకు. ఆ మనిషి సంస్కృతీ, శక్తి ముఖ్యం అని వేమన్న వాదం.

చీమలు చిన్నవే గాని చీమల లోకం చిన్నది కాదు. చీమల జీవన వ్యవస్థ మనుష్య వ్యవస్థను మించినట్టిది. చీమల్లో రాజు, రాణి శ్రామిక వర్గాలు అని మూడు రకాలుంటాయి. కాని రాజు గొప్ప ఏమి లేదు. అవసరాన్ని, పనిని బట్టి విలువకాని అదనపు గొప్పలు చీమల్లో ఉండవు. చీమలు ఇతర కాలాల్లో శ్రమించి, ఆహారం నిల్వ చేసుకుని వర్షాకాలంలో కూచొని తింటాయి.

చీమల శక్తి కూడ చిన్నది కాదు. ఒక చీమ తన బరువు కంటె యాభై రెండు రెట్ల బరువును మోస్తుంది. సుమతికారుడు చెప్పినట్టు, 'బలవంతమైన సర్పము చలిచీమల చేతచిక్కి చస్తుంది. చీమ శరీరాలకు అనేక స్థితిగతులను భరించే శక్తి ఉంది. గాలిలో ప్రాణవాయువు కొంతకాలం లేకున్నా చీమలు బతుకుతాయని శాస్త్రజ్ఞులు అంటారు. మనిషి చచ్చి ఊరుకుంటాడు కాబట్టే వేమన 'దాని జీవమెంతో' తెలుసుకొమ్మంటున్నాడు. చీమల్లా అల్పంగా కనపడే వారి సృష్టిని లోనెరగమంటున్నాడు. లోనెరగటం అంటే మొదలంటా పరిశీలించటం అనికూడా అర్థం చెప్పుకోవచ్చు. సృష్టి అంటే సంస్కృతి అనే అర్థంకూడ ఉంది. చీమల వ్యవస్థకు ప్రాచీన గ్రామవ్యవస్థకు పోలిక కూడా ఇక్కడ ఊహించవచ్చు.

కుండ కుంభమండ్రు కొండ పర్వతమండ్రు
ఉప్పులవణమండ్రు ఒకటి గాదె
భాషలింతెవేరు పరతత్త్వ మొక్కటి
విశ్వదాభిరామ వినురవేమ

తెలుగులో అన్నా సంస్కృతంలో అన్నా పదార్థ మొక్కటే, ప్రయోజన మొక్కటే అంటున్నాడు వేమన. మాటలను పట్టుకొని వేలాడటం అనవసరం. అర్థం, ఉద్దేశం ముఖ్యం.

భాషల్లో ఎక్కువభాష, తక్కువభాష, మంచిభాష, చెడ్డభాష అంటూ ఉండవనీ అన్నీ మానవ భావ వ్యక్తీకరణకు వాహికలే అనేది శాస్త్రీయ దృక్పథం.

ఏ భాషలో చెప్పినా మూలతత్వం ఒక్కటే. సంస్కృతంలో చెప్పినంత మాత్రాన అది ఎక్కువ సత్యమై, తెలుగులో చెప్పినంతమాత్రాన అది తక్కువ సత్యంకాదు. మామూలుభాషలో చెపితే ఈసడించేవారు కొందరు అనాడుకూడా ఉండిఉంటారు. అదీకాక వేమన్న సామాన్యప్రజల తాత్త్వికుడు. కొందరికి మాత్రమే అందుబాటులో ఉన్న తత్త్వ రహస్యాలను ప్రజల భాషలో చెప్పాలన్న ప్రయత్నం వేమన్నది. ఈ ప్రయత్నాన్ని సంస్కృత పండితులు సహజంగా చిన్నచూపు చూస్తారు. అల్లాంటి వాళ్ళకు ఈ పద్యం సమాధానం. భాషలెన్నైనా భావ మొక్కటే అని వేమన్న వాదం.

తప్పులెన్నువారు తండోప తండంబు
ఉర్విజనులకెల్ల నుండు తప్పు
తప్పులెన్నువారు తమ తప్పు లెరుగరు
విశ్వదాభిరామ వినురవేమ

'తప్పులేనివారు ధరణిలో లేరు' అని సామెత. కాని ఏది తప్పు ఎవరికి తప్పు అనేది ప్రశ్న.

కది ల్తేబాలు తప్పుపట్టేవారు కొల్లలుగా వుంటారు. కాని ఆ తప్పేదో వివిధ రూపాల్లో అందరికీ వుంటుంది. తమ తప్పులను చూసుకోక ఎదుటి వారి తప్పులెన్నటం అజ్ఞానం అంటున్నాడు వేమన. ఒకవేళ తప్పు కలిగినా దానిని మరిచిపోవటం మంచిది. తప్పులను సాగదీసి శత్రుత్వాల దాకా దారి తియ్యటం అనవసరం.

తండము అంటే గుంపు అని అర్థం. తండోపతండం అంటే గుంపులమీద గుంపులు, చాల ఎక్కువ అని అర్థాలు. 'ఎన్ను' అనే క్రియకు లెక్కపెట్టటం, వెతకటం, పట్టించుకోవటం అని వివిధఛాయల్లో అర్థాలు చెప్పుకోవచ్చు.

వ్యక్తులమధ్య అయినా, వ్యవస్థలోనైనా సామరస్యం, సానుభూతి లోపించినప్పుడు దోషారోపణం మొలకెత్తుతుంది. తన కాలంలో అంతరించి పోతున్న మంచి విలువల్ని పట్టి ఆపాలని వేమన్న తాపత్రయం.

అనువుగానిచోట అధికుల మనరాదు
కొంచెముండుటెల్ల కొదువగాదు
కొండ అద్దమందు కొంచమై యుండదా
విశ్వదాభిరామ వినురవేమ

అనుకూలం, అవకాశం కలిసిరానిచోట అధికృతను ప్రదర్శించు కోవటం అనవసరం. అట్లాంటి సందర్భాల్లో ఒదిగిపోయి వంగిపోయి ఉన్నా గొప్పతనం తక్కువకాదు. నామోషీ లేదు. పెద్దకొండ చిన్న అద్దంలో ఇమిడినట్టు కనిపించాలి. అంతమాత్రాన కొండ పరిమాణం తగ్గదు అని వేమన్న భావం.

ఎంత ముక్కుసూటిగా పోయేవాడికైనా, నిజాయితీపరుడికైనా కార్యసాధకుడన్నప్పుడు యుక్తి సమయస్ఫూర్తి ఉండాలి. అన్నీ ఉండి అదికూడా లేనప్పుడు కార్యం చెడుతుందంటున్నాడు వేమన. సుమతికారుడు చెప్పిన 'తప్పించుకు తిరిగేధన్యత' మంచిదికాదు గాని, ప్రమాదాలను తప్పించుకునే ఉపాయశీలత తప్పకుండా ఉండాలి.

దీనికి వేరే పోలికల్తో పాఠాంతర పద్యం కనిపిస్తుంది.

అనువుగానిచోట అధికుల మనరాదు
ఒదిగి యొక్కవంకకుండవలయు
మఱ్ఱియాకు మీద మాధవుడుండగా

(డి. 1727; 68)

నిక్కమైన మంచి నీలమొక్కటిచాలు
తళుకు బెళుకు రాళ్లు తట్టెడేల
చదువ పద్యమరయ చాలదా యొక్కటి
విశ్వదాభిరామ వినురవేమ

పై మెరుగుల నకిలీరాళ్ళు తట్టెడున్నా వాటికన్న ఒక అచ్చపు నీల మణి విలువైనది. శుష్క పాండిత్యంతో రచించిన నిస్సార బృహత్ గ్రంథం కంటె జీవితంలోంచి చీల్చుకొచ్చిన ఒక్క పద్యం గొప్పది.

అన్ని సమయాల్లో సంఖ్యాబలం చూసి మోసపోవద్దు. ఆ బలం ఎటువైపు నిర్దేశించబడిందనేది ముఖ్యం. కావ్యానికి సైజూ, బరువూ కాదు. గాధల, ఆరాటాల, ఆవేశాల బరువు గమనించమంటున్నాడు వేమన.

'చాటు పద్యమరయ చాలదా యొక్కటి' అనేది పాఠాంతరం. చాటువు చాటవ అనే పదాలు సామెత అనే అర్థంలో ఉన్నాయి. సామెత జీవితానుభవాల పైన పేరిన మీగడలాంటిది.

నిక్కమైన అంటే నిజమైన, యథార్థమైన, నిష్కల్మషమైన అని అర్థాలు. నీలమంటే మెరిసే నల్లని రాయి. ఆభరణాల్లో పొదుగుకునేది స్థిరమైన సహజకాంతులు వెదజల్లే అమూల్య మణి. తళుకు బెళుకులు అంటే కదిలే మసకకాంతులు అని అర్థం. ఓ పట్టాన చూపులకు నిలువవు. కంటిని మోసం చేస్తాయి అని వేమన్న భావం. కాబట్టి తళుకుబెళుకులను దాటి 'అరయ' మంటున్నాడు వేమన.

'అరయు' అంటే గాఢంగా పరిశీలించటం అని అర్థం. ప్రాచీన సాహిత్యంలో ఈ మాట పాద పూరణానికి ఉపయోగించిన ఘట్టాలున్నా, ఇక్కడ దీని ప్రయోగం అర్థవంతం.

"చాటుపద్య మరయ చాలదా యొక్కటి"
అనేది పాఠాంతరం. (డి. 1723: 180 & డి. 1762: 4)

అల్పుడెపుడు పల్కు నాడంబరముగాను
సజ్జనుండు పల్కు చల్లగాను
కంచుమ్రోగినట్లు కనకంబు మ్రోగునా
విశ్వదాభిరామ వినురవేమ

మాటల్లో డాబుకొట్టే వాడెప్పుడూ అల్పజనుడే. సత్యసౌందర్యంతో హాయిగొలిపేట్టు పలికేవాడు సజ్జనుడు. కాంతితో కళ్ళద్వారా మురిపించేది, అన్ని విధాల విలువైనది బంగారం. అది చెవులను దద్దరిల్లచేసే కంచులా మ్రోగుతుందా?

మనోవాక్కాయ కర్మలు ఒకటిగా ఉండేవాడు సజ్జనుడు. నిజంలోని ప్రకాశం నీ మాటల్లో ఉంటే వినేవాడికి నిజమైన ఆనందం కలుగుతుంది. ఏదైనా చూపించుకోవాలని, ప్రదర్శించుకోవాలని తాపత్రయపడటం తరచుగా అది లేనప్పుడే జరుగుతుంది. అబద్ధాల్తో బతికేవాడు అల్పుడు అని వేమన్న వాదం.

కంచువాద్యం, కంచుగంటలు ఒళ్ళు గగుర్పొడిచే శబ్దాలు పుట్టిస్తాయి. స్పష్టంగా ఉన్నట్టుంటాయి. కాని స్పష్టతలో నిజాయితీ ధ్వనించా లంటున్నాడు వేమన. చల్లగా అంటే మృదువుగా, మనసుకు ఆహ్లాదకరంగా అని అర్థాలు.

పాఠాంతరాలు: సత్యవ్రతుడు పల్కు సమముగాను (డి. 1725; 326); అధికుడూరకుండు అడిశపడక (డి. 1735; 347); కాకి కూసినట్లు కోకిల కూసునా (డి. 1727; 109).

అనగ నవగ రాగ మతిశయిల్లుచునుండు
తినగ తినగ వేము తియ్యనుండు
సాధనమున పనులు సమకూరు ధరలోన
విశ్వదాభిరామ వినురవేమ

మాట్లాడే కొద్ది సంభాషించే కొద్ది ఒకరికొకరు అర్థమై అనురాగం పెరుగుతుంది. తినటం అలవాటైతే వేపకాయకూడ తియ్యగా మారుతుంది. అభ్యాసం ఉంటే చాలు ఏ కళలైనా వర్ధిల్లుతాయి, ఏ కార్యమైనా సానుకూల మవుతుంది.

అతి ప్రసిద్ధమైన వేమన పద్యాల్లో ఇదొకటి. పట్టుదలతో పరిశ్రమించటం అవసరం అనే ఉద్బోధ ఉంది ఈ పద్యంలో.

....అతి రమ్యమైయుండు (డి 1727; 64): పెనగ పెనగ సతికి ప్రియము పుట్టు (డి. 1723; 158) అనేవి పాఠాంతరాలు.

చదువులందు పాడి మొదవులందును స్త్రీల
పెదవులందు రాజ్యపదవులందు
ఆశ లుడిగినట్టి అయ్యలు ముక్తులు
విశ్వదాభిరామ వినురవేమ

వ్యక్తిగత వ్యామోహాలు ప్రజల కేవిధంగాను ఉపయోగ పడవంటున్నాడు వేమన.

పాండిత్య ప్రకర్ష కోసంగాని, పేరు కోసంకాని చదివే శుష్కవిద్యలు, సంపదను పెంచుకోడానికి సమకూర్చుకునే ఆలమందలు, స్త్రీ వ్యసనాలు, అధికార కాంక్షలు ఇటువంటి ఆశలుగల వాళ్ళు బంధితులేకాని

ము కులు కారు.

నలుగురికి ఉపయోగపడే చదువులు నిజమైన చదువులు. ఒక్కడికే సంపద పెరగటంవల్ల ఇతరులకు కలిగే ప్రయోజనంలేదు. శ్రీ కాంక్ష కుటుంబ వ్యవస్థ పరిధిలో సాగాలి. అధికారం ప్రజలకు సేవచేయటానికి కాని స్వార్థ ప్రయోజనాలకు కాదు.

మొదవులు అంటే పాడి ఆవులని అర్థం.

మాటదిద్దవచ్చు మరి ఎగ్గులేకుండ
దిద్దవచ్చు రాయి తిన్నగాను
మనసుదిద్దరాదు మహినెంత వారికి
విశ్వదాభిరామ వినురవేమ

మనసులో ఏదైనా భావం పుట్టిందా దాన్ని మార్చటం ఎంతటి వారికైనా సాధ్యంకాదు. దీనికన్న ప్రమాదం రాకుండా మాటనైనా మార్చుకోవటం, కఠిన పాషాణాన్ని కావలసినట్టు మలుచుకోవటం సులభమంటున్నాడు వేమన్న.

'దిద్దు' అంటే సింగారించటం, మెరుగు పెట్టటం, తప్పును ఒప్పుగా మార్చుకోవడం అని అర్థాలు. మాటతూలటం వల్ల చాలా యిబ్బందులొస్తాయి. 'పెదవి దాటితే పృథివి దాటుతుంది' అని సామెత. పెదవి దాటి వెలువడ్డ మాటను వెనక్కి రప్పించుకోవటం అసాధ్యం. అయినా భావాలను మార్చుకోవటంతో పోలిస్తే అది సాధ్యమే. ఎగ్గు అంటే కీడు, సిగ్గు, గాయం అని అర్థాలున్నాయి.

ఎరుకమాలువాడు ఏమేమి చదివిన
చదివినంతసేపు సద్గుణియగు
కదిసి తామరందు కప్పగూర్చునట్లు
విశ్వదాభిరామ వినురవేమ

గమ్య మెరుగక, దిక్కూ తెన్నూ దృష్టిలో లేక జీవితానికి అన్వయించుకోక చదివే చదువు ఎరుకమాలిన చదువు. అటువంటివాడు ఏది చదివినా ఎంత చదివినా చదివినంతసేపే. గుటకలు మింగుతూ సొంతం అర్థమైనట్టు ప్రకాశిస్తాడు. వాడి మానసిక జాడ్యాలకు ఆ చదువు గుణమిచ్చినట్టు కనిపిస్తాడు. రోగానికి మందు పని చెయ్యటాన్ని గుణమివ్వట మంటారు. గుణం పొందినవాడు గుణి. ఆ చదువు ప్రభావం వదిలిపోగానే వెనకటిలాగే మిగుల్తాడు. తామరపువ్వులో కూచున్న కప్ప పరిసరాలవల్ల అందంగానే కనిపిస్తుంది. మళ్ళీ నీళ్ళలోకి గంతేసిన మరుక్షణం నుంచి తామర తామరే, కప్ప కప్పే. కదిసి అంటే దరిచేరి అని అర్థం.

లోతుకు దిగి పరిశీలించనివాడు ప్రతిదానికీ ప్రభావితుడౌతాడు. కాని ఆ ప్రభావం తాత్కాలికమే. అసలు తత్త్వం తెలుసుకొన్న వాడి వ్యక్తిత్వాన్ని ఏ ప్రభావమైనా మరింత పరిపుష్టం చేస్తుంది.

చేకొనుచును తమకు చెయిసాగినంతలో
చెడిన ప్రజల రక్ష సేయలేని
తనదు సాగుటేమి తన తనువదియేమి?
విశ్వదాభిరామ వినురవేమ

అధికారం చేతిలో ఉన్నవాడు తన అధికార పరిధిలో వీలయినంత వరకు బాధితులను, బలహీనులను రక్షించాలి. అట్లా రక్షించని వాడి

వైభవం, బతుకూ వ్యర్థమే.

చేకొనుట అంటే అధికార స్వీకరణ అని అర్థం. చెయిసాగినంతలో అంటే అధికారమున్నంతలో నన్నమాట.

తనకు సాగటం ముఖ్యంకాదు. సాగించుకోవటం కూడా కాదు. చెడినవారిని చేరదీసి వారి హక్కులు సాగేటట్టు చూడాలి.

కన్నులందు మదము గప్పి కానరుగాని
నిరుడు ముందటేడు నిన్న మొన్న
దగ్గులైన వారు తమకంటె తక్కువా?
విశ్వదాభిరామ వినురవేమ

అంతా మేమే పొడిచేస్తున్నాం వెనకటివాళ్ళు చేసిందేమీ లేదు అనుకోవటం భ్రమ అంటున్నాడు వేమన.

చూడలేని పరిస్థితి వస్తే కళ్ళన్నా పోయుండాలి. ఉంటే వాటిని మదం పొరలన్నా కప్పి ఉండాలి. నువ్విప్పుడు చేసే ప్రయత్నాన్ని గతంలో ఎందరో మొదలుపెట్టి కొనసాగించారు. వాళ్ళ భుజాలమీద నిలబడి వాళ్ళు నీకంటె తక్కువ అనుకోవటం దురహంకారం.

'గత కాలము మేలు వచ్చుకాలము కంటెన్' అనేది అన్ని సందర్భాల్లో నిజం కాదుగానీ, గతాన్ని పూర్తిగా విస్మరించే వాడికి చరిత్రలేదు. ముందుకు సాగటానికి అనుభవ పాఠాలు లేవు. పైగా అట్లా అనుకోవటం పొగరుమోత్తనం. వెనకటి వాళ్ళ కృషినీ, త్యాగాలను స్మరించటం నీ విధి.

దగ్గులైనవారు అంటే చనిపోయినవారని అర్థం. ఎప్పుడో పిడికెడు బూడిదయ్యారు సరే. వాళ్ళు సాధించిన ఫలితాలను చూడలేక పోవటం గుడ్డితనం అని వేమన్న వాదం.

నేరనన్న వాడు నెరజాణ మహిలోన
నేర్తునన్నవాడు వార్తకాడు
ఊరకున్నవాడె ఉత్తమోత్తముండెదు
విశ్వదాభిరామ వినురవేమ

కార్యకర్తల్లో మూడు రకాల వ్యక్తులుంటారు. ఒకడు ప్రతిదీ నాకు తెలియదు నేను చెయ్యలేను అని తప్పించుకుంటాడు. వీడు నెఱజాణ, అంటే నేర్పరి. సుమతికారుని "ధన్యుడ"న్నమాట. నేరనన్నవాడు అంటే అసమర్ధతను వ్యక్తపరిచే వాడన్న మాట.

రెండవవాడు అది చేస్తాను ఇది చేస్తాను అని కోతలు కోస్తాడు. వీడి మాటలు కోటలు దాటుతాయిగాని కాళ్ళు తంగెళ్ళు దాటవు. వార్త అంటే మాట, సంభాషణ, అని అర్థాలు. వార్తకాడు అంటే మాటకారి, వాగుడు కాయ అని అర్థాలు. ప్రసిద్ధికెక్కుట అనే అర్థంలో వార్తకెక్కుట అని వేరేచోట వాడాడు వేమన.

మూడవవాడు మౌనంగా పనులు చేసుకపోతాడు. వీడు నిజమైన క్రియాశీలి. ఇటువంటివాడు ఉత్తముడు అంటున్నాడు వేమన.

చచ్చు వారలెవరు? చావని వారేరి?
చచ్చి బతికి యుండు జనములెవరు?
విచ్చలవిడిగాను వివరించి చూడరా
విశ్వదాభిరామ వినురవేమ

చావు అందరికీ సహజం; ఎప్పుడో ఒకప్పుడు తప్పకుండా వస్తుంది. 'చావుకు చావు ఉన్నదా' అని సామెత. కాని కొందరికి చావులేదు. వారు

భౌతికంగా చనిపోయినా బతికున్నప్పుడు చేసిన ప్రజాహిత కార్యాలవల్ల కలకాలం బతికి ఉంటారు. నలుగురికోసం పాటుపడ్డవాడెప్పుడూ ఆ నలుగురి మనసుల్లో, నాలుకల మీదా ఇల్లు కట్టుకుంటాడు. వారినే చచ్చి బతికియుండు జనములు, "చావనివారు" అంటున్నాడు వేమన.

ఇక ఎవడికీ పనికిరాక, చైతన్యం లేక కాలం వెళ్ళబుచ్చే వాళ్ళుంటారు. వేమన్న దృష్టిలో వీళ్ళు బతికి ఉండికూడా చచ్చిన వాళ్ళతో సమానం. 'బతికి బతుకులేని ప్రాణులు' అంటాడు వేరేచోట. జీవన్మృతులు, జీవచ్ఛవాలు అనే పదబంధాలు తరచుగా వాడుకుంటాం. వేమన్న వేరేచోట వాడిన 'నడపీనుగలు' ఇటువంటివే.

బతికున్నప్పుడే పనికొచ్చే పనులుచేసి ఎల్లకాలం బతకమని వేమన్న ప్రబోధం. దీనికి చరిత్రలోగాని, లోకంలోగాని 'వివరించి' చూస్తే 'విచ్చల విడిగా' అంటే తరచుగా దృష్టాంతాలు కనిపిస్తాయి.

పెద్దల వచనములు ప్రేమతో జూచితా
నటుల నడువబోవ ననువు పడదు
పులిని జూచి నక్క పూత పూసినయట్లు
విశ్వదాభిరామ వినురవేమ

పెద్దలు అనుభవంతో చెప్తారు వినాలి అనేది లోకరీతి. 'పెద్దల మాట పెన్నిధి మూట' లాంటి సామెతలుకూడ పుట్టాయి. కాని పెద్దలమీగ ప్రేమతో గుడ్డిగా అనుసరించేవాడు భావదాసుడే అంటున్నాడు వేమన. పెద్ద అభిప్రాయాలు, భావాలు వాళ్ళ అనుభవాలవల్ల ఏర్పడినవి. అవి జ కాలాలకు పనికొస్తాయని చెప్పలేం. తరాల అంతరాలు ఉండనే ఉంటా ఆప్తవాక్యాలు మంచివే కావచ్చుకాని అవి నీ కాలంలో ఆచరణీయ కావో ఆలోచించమంటున్నాడు వేమన.

వెలయ భూమి తల్లి విత్తనమటు తండ్రి
పంటలరయ సుతులు పాడి పరము
ధర్మము తనపాలి దైవము సిద్ధము
విశ్వదాభిరామ వినురవేమ

భూమి తల్లిలాంటిదైతే బీజావాపనం చేసేవాడు తండ్రి. ఫలితంగా పుట్టిన పంటలు సంతానం. పాడిపై నుంచి వచ్చేది అంటే ఇతరమైంది. తాను పాటించే వ్యవసాయ ధర్మమే తనకు ఎదుట కనిపించే దేవుడు. ఆది వ్యవసాయ సమాజంలో భూమిని స్త్రీగా, తల్లిగా ఆకాశాన్ని తండ్రిగా భావించే ఆచారముంది. భూమి పంటలను కంటుంది ఆకాశంలోంచి వర్షాలు కురిపించి విత్తును మొలకెత్తిస్తాడు. కాబట్టి ఆకాశం తండ్రి. పంటలే పిల్లలు. ఆ పంటలను తిని బతికే మనమూ భూమిపిల్లలమే. వ్యవసాయం నేర్చినవారు గో సంస్కృతిని ఇతరంగా భావించేవారు. భూమిని నమ్ముకున్న వారికి "కృషియే ధర్మం, ప్రత్యక్ష దైవం" అంటున్నాడు వేమన. "భూములిచ్చినట్లు భూపతులీయగలరా" అని సామెత.

భూమిలోన పుణ్యపురుషులు లేకున్న
జగములేల నిల్చు పొగులుగాక
అంత తరచు దొరక రాడ నాడనుగాని
విశ్వదాభిరామ వినురవేమ

ఏ వ్యవస్థలోని వారైనా అందరూ ధూర్తులే, పాపులే అని నిర్ణయానికి రావటం తొందరపాటే అవుతుంది. అక్కడక్కడ ద్వీపాల్లాగా సజ్జను లుంటారు. కాని వారి సంఖ్య నాటి అధర్మస్థితిని ఎదుర్కోగలిగినంతగా ఉండకపోవచ్చు. పొగులు అంటే దుఃఖించు, పరితపించు అని అర్థాలు.

ఆడ నాడ అంటే అక్కడక్కడ, అరుదుగా అని అర్థం. సజ్జనుల సంఖ్య ఎప్పుడూ స్వల్పమే అని ఇక్కడి భావం.

ఎంత భూమి తిరిగి ఏపాటు పడుచున్న
అంటనీక ప్రాప్తి వెంట దిరుగు
భూమి కొత్తయైన భుక్తులు కొత్తలా
విశ్వదాభిరామ వినురవేమ

"తిరిగి, రైతు, తిరగక బైరాగి చెడతారు" అని సామెత. ప్రాచీన గ్రామ వ్యవస్థ పునాదులు కదిలిపోతున్న దశలో పుట్టిన పద్యమిది. వ్యాపారాలు ప్రవేశించి వ్యవసాయదారుడు దెబ్బతిన్నాడు. తరతరాల నుంచి నమ్ముకున్న భూములు అమ్ముకుని వలసపోతున్నారు. తెలిసిన వృత్తులను వదిలి తెలియని వృత్తుల్లోకి వెళ్ళట మెందుకని ప్రశ్నిస్తున్నాడు వేమన.

ఉన్న భూమి వదులుకొని ఎంత ప్రపంచం తిరిగినా, ఏ పాటుపడినా నీ ప్రాప్తి నీ వెంటే వస్తుంది. నీకు దొరకవలసినంత కంటె ఎక్కువ అంటనీయదు. వెళ్ళిన భూమి నీకు కొత్తది కావచ్చు గాని నీ భుక్తి, నీ అవసరం నీకు కొత్తదా అని వేమన్న వాదం. నువ్వు ఎప్పటిలాగే ఉన్నావు తెలుసుకో అని అంటున్నాడు వేమన.

కోపమునను ఘనత కొంచెమైపోవును
కోపమునను మిగుల గోడు జెందు
కోపమడచనేని కోరికలీడేరు
విశ్వదాభిరామ వినురవేమ

వేమన్న భావావేశం అసాత్త్వికమైనదని వాదించే వాళ్ళున్నారు.

ద్వేషం, కోపం, అసూయ, అసహ్యం, ప్రేమ, భక్తి మొదలైనవి భావాలు. వేమన్న అప్పటి సమాజం విలువల పట్ల అసహనం, కోపం ప్రదర్శించాడు. కాని ఆ కోపం వ్యక్తిగత కోపం కాదు. నాటి జడీభూత వ్యవస్థపైన ప్రకటించిన ధర్మాగ్రహం. వ్యక్తిగత కోపం వ్యష్టికే కాదు సంఘశాంతికి కూడ నష్టమే.

తనకు లేదని దేబిరింపుతో, ఆక్రోశంతో పుట్టే కోపాన్ని వేమన ఖండిస్తున్నాడు. అట్లాంటివాడికి "తన కోపమె తన శత్రువు". కోపం వల్ల గౌరవం, గొప్పతనం మంటగలుస్తాయి. ఎదుటి వాళ్ళకు దుఃఖం బాధ కలుగుతాయి. కోరికలు తీరక కోప్పడితే లాభం లేదు. కోపాన్ని నిగ్ర హించుకుంటేనే కార్యం సానుకూలమవుతుంది.

చిక్కియున్న వేళ సింహంబునైనను
బక్క కుక్క సేరి బాధ సేయు
బలిమి లేనివేళ పంతంబు సెల్లదు
విశ్వదాభిరామ వినురవేమ

కాలం ఎప్పుడూ ఒక రీతిగా ఉండదు. అడవిలోని చిన్న జంతువులను అదలగొట్టిన సింహం, పరిస్థితులు ఎదురు తిరిగినప్పుడు వాటికే భయపడవలసి వస్తుంది. వలలోగాని బోనులోగాని చిక్కిన సింహాన్ని బక్క కుక్క సైతం బెదిరిస్తుంది. బలం తగ్గినప్పుడు పంతానికి పోవటం అనవసరం అంటున్నాడు వేమన్న. "చెడి బతికిన వాడికి శౌర్యమెక్కువ బతికి చెడిన వాడికి బదవలు ఎక్కువ" అని సామెత. 'పంతం' అనే మాటకు ప్రతిజ్ఞ, శపథం అని అర్థాలు. ఇక్కడ బింకం బెట్టు అని చెప్పుకోవచ్చు.

ఈ పద్యం సుమతి పద్యాన్ని గుర్తుకు తెస్తుంది.

బలవంతుడు నాకేమని
పలువురతో నిగ్రహించి పలుకుటయేలా
బలవంతమైన సర్పము
చలి చీమలచేత చిక్కి చావదె సుమతీ!

మంచివారు లేరు మహిమీద వెదకిన
కష్టులెందరైన కలరు భువిని
పసిడి లేదుగాని పదడెంత లేదయా
విశ్వదాభిరామ వినురవేమ

కల్మషంలేనివారు లోకమంతా వెతికినా దొరకరు. కాని నీచులకు కొదువలేదు. బంగారం లభించటం కష్టం కాని దుమ్ము, ధూళీ ఎక్కడ పడితే అక్కడ ఉంటాయి.

మంచి అనేది సాపేక్షకం. ఏదిమంచి ఎవడికి మంచి ఏ పరిస్థితుల్లో మంచి అని ప్రశ్నలు వస్తాయి. ఒక్కమాటలో ఎదుటివాడికి మేలు చేసేది, కనీసం హాని చెయ్యనిది "మంచి" అని చెప్పుకోవాలి. "లేదు" అంటే అరుదు అని అర్థం. కష్టుడు అంటే నీచుడు, ఈ పదం వేమన్న తరచుగా వాడతాడు. మంచి వాళ్ళెంత స్థిరమైనవాళ్ళో కష్టులంత చంచలమైన వాళ్ళు. బంగారం బరువైంది, పచ్చటి ప్రకాశంతో కళ్ళకు హాయి గొలిపేది. దుమ్ము తేలికైంది. లేచి కళ్ళల్లోపడి దృష్టి నడ్డగిస్తుంది. పదడు అంటే దుమ్ము, చెత్త అని అర్థం. తమిళంలో "పదర్" అనేమాట ఈ అర్థంలోనే ఉంది. మంచివాళ్ళు బంగారమంత విలువైనవారు, అరుదైనవారు. మంచి వాళ్ళ స్నేహాన్ని పొందటానికి, భూమి లోంచి బంగారాన్ని వెలికి తీయట మంత కష్టపడాలి అని వేమన్న వాదం.

కుండ పగిలెనేని కొత్తది కొనవచ్చు
భూతలంబు నందు పొందుగాను
కూలబడిన నరుడు కుదురుట అరుదయా
విశ్వదాభిరామ వినురవేమ

కుండ పగిలితే అతుక్కోదు. కాని అట్లాంటి కుండ పగిలితేకూడ పారేసి కొత్తకుండ కొనుక్కోవచ్చు. కాని మనిషి ఒక్కసారి దెబ్బ తిన్నాడా కోలుకోవటం కష్టం అంటున్నాడు.

మార్పులు జరిగి కొత్త విలువలు వస్తున్నప్పుడు వాటి ధాటికి తట్టు కోవటం కష్టం. మధ్యయుగాల్లో కులవృత్తులు దెబ్బతిని చేతిపనులవాళ్ళు చావుదెబ్బ తిన్నారు. అట్లాంటి సమయాల్లోనే చిన్నకులాల నైరాశ్యానికి ప్రతీకగా వీరబ్రహ్మం లాంటి వాళ్ళ తత్త్వాలు వెలువడ్డాయి. వేమనపద్యాల్లో ప్రతీఘాతాలే కాని నిరాశకు తావులేదు.

కూలబడుట కూచోటానికి సరదాగా వాడేమాట కాని మంచం పట్టటం, లేవకుండా పడిపోవటం, అకస్మాత్తుగా పడిపోవటం అనికూడ అర్థాలున్నాయి. కుదురుట అంటే కోలుకోవటం, చెదిరి పోయినవి, ఒక చోటికి రావటం అని అర్థాలు.

నీళ్ళలోన మొసలి నిగిడి తిన్నగ బ్రాకు
బైట మూరడైన బ్రాకలేదు
నెలవు దప్పచోట నేర్పరి కొరగాడు
విశ్వదాభిరామ వినురవేమ

నీరే నివాసమైన మొసలి, నీళ్ళలో ఎంత దూరమైనా అవలీలగా

వేగంగా ఈదుకుంటూ వెళ్తుంది. ఒడ్డునబడ్డ మొసలికి నేలమీద మూరెడు దూరం ప్రాకడంకూడ కష్టమవుతుంది. ఒకచోట నేర్పరి అయినవాడు మరోచోట ఎందుకూ కొరగాక పోవచ్చు.

ఒక రంగంలో ప్రావీణ్యం ఉన్నంతమాత్రాన ఒకడు ప్రవేశంలేని పనుల్లో తలదూర్చి రాణించలేడు అని వేమన్న వాదం.

నిగిడి అంటే సాగి అని అర్థం. తిన్నగా అంటే వాలుగా, యోగ్యముగా, ఋజువుగా అని అర్థాలు. మూరెడు అంటే మోచేతినుంచి మధ్యవేళ్ళ కొసల వరకు ఇప్పటికీ ఊళ్ళల్లో వాడే కొలత. ముఖ్యంగా వస్త్రాలకు వాడతారు, "ఈ బట్టకు మూరలేదు వెడల్పులేదు" అని సామెత.

పట్టు పట్టరాదు పట్టి విడువరాదు
పట్టెనేని బిగియ పట్టవలయు
పట్టు విడుటకన్న పడి చచ్చుటే మేలు
విశ్వదాభిరామ వినురవేమ

దేంట్లోనైనా సరె దిగేముందు లోతును గురించి ఆలోచించి దిగాలి, పట్టిచూసి మరి పట్టుకోవాలి. పట్టుకొని చూసి పట్టు దొరకలేదని చాలించుకోకూడదు. పట్టుకున్న దాన్ని గట్టిగా నమ్ముకోవాలి. పట్టిన పట్టు విడవటం కన్న ఆత్మహత్య మేలనేది వేమన్న వాదం.

నడిచే దారిలో ముళ్ళూ రాళ్ళూ ఎదురైతే తోక ముడిచేవాడు పిరికివాడు. కష్టాలు పద్మవ్యూహామై చుట్టుముడితే సుఖాదులతో రాజీపడేవాడు అవకాశవాది. పిరికివాడు, అవకాశవాది ఆదర్శాన్ని హత్య చేస్తారు. అది ఆత్మహత్యతో సమానమంటున్నాడు వేమన్న. కార్యసాధకుడికి ఉండాల్సిన పట్టుదల ఈ పద్యంలో విషయం.

మాళ్లు వెంటరావు మణులు వెంటరావు
ఆలుబిడ్డలు హితులరయరారు
తాను ఇచ్చు ఈవి తనవెంట వచ్చునా
విశ్వదాభిరామ వినురవేమ

జీవించి ఉన్నప్పుడు చేసిన ప్రజాహిత కార్యాలవల్ల వచ్చిన మంచి పేరే మనిషి సంపాయించుకోగలిగింది. కట్టిన పెద్ద భవనాలు, సంపాదించి కూడబెట్టిన నగా, నట్రలు, పెళ్ళాం బిడ్డలూ, స్నేహితులు, ఏవీ, ఎవరూ మిగలరు. చచ్చిపోయేప్పుడు వెంటరారు.

కాబట్టి బతికున్న రోజుల్లోనే నలుగురికి ఉపయోగపడే పనులు చెయ్యాలని వేమన్న వాదం.

మాళ్ళు, మహల్ అనే ఉర్దూ మాటలకు రూపాంతరం చెందిన బహురచన రూపం భవనాలు అని అర్థం. ఈవి అంటే దానగుణం అని అర్థం.

పరగ రాతిగుండు పగులగొట్టగవచ్చు
కొండలన్ని పిండి గొట్టవచ్చు
కఠినచిత్తు మనసు కరిగింపరాదు
విశ్వదాభిరామ వినురవేమ

తడిలేనిది, కర్కశమైనది అయినా రాతిగుండును దానికన్న గట్టిదైన సుత్తెతో ముక్క చెక్కలు చెయ్యొచ్చు. మందుగుండు సామగ్రిని దట్టించి పెద్దపెద్ద కొండల్ని సైతం నుగ్గు నుగ్గు చెయ్యొచ్చు. కాని ఆర్ద్రతలేని కఠినుని మనస్సును కదిలించటంగాని, కరిగించటంగాని కష్టం అంటున్నాడు వేమన.

చిత్తమన్నా, మనస్సన్నా వ్యవహారంలో హృదయ మనే అర్థంలో ఉన్నాయి. కాని వేమన్న "కఠినచిత్తుమనసు" అంటున్నాడు. అక్కడ చిత్తం స్వభావానికి సంబంధించింది. కఠిన చిత్తం కలవాడు చిత్తగించమన్నా చిత్తగించడు. చిత్తానుసారంగా ప్రవర్తిస్తాడు. మనస్సును అనుభూతి ఆర్ద్రత, ఇష్టం అనే అర్థంలో వాడుతున్నాడు వేమన. "నీ మనస్సెట్లా ఒప్పింది" "మనసైనవాడు" అన్నప్పుడు కోమలత్వం, ఇష్టం అనే అర్థాలు వస్తాయి. కఠిన చిత్తం కలవాడి మనస్సు కూడా అభేద్యమే అని వేమన్న వాదం.

లోకం తగలపడిపోతుంటే ఫిడేలు వాయించే 'నీరో' మహారాజాలు బాధ పడేవాడిని ఆదుకోటానికి అంతరాలు అడ్డొచ్చే కుహనా సంప్రదాయకులు మానవతానుభూతి ఒక్కసారైనా పొందని పాషండులు మొదలైనవారు కఠినచిత్తుల కోవలోకి వస్తారు.

ఆడి తప్పువారలభిమాన హీనులు
గోడెరుగనివాడు కొద్దికాడు
కూడి కీడుసేయ క్రూరుండు తలపోయ
విశ్వదాభిరామ వినురవేమ

మాట ఇచ్చి తప్పేవాడు సిగ్గులేని వానితో సమానం. ఇతరుల వ్యధను అర్థం చేసుకోలేనివాడు అల్పుడు. స్నేహంచేసి మోసగించేవాడు నిజంగా క్రూరుడే.

అభిమానం అంటే విశ్వాసం, సంరక్షణ, గర్వం హద్దు అని వివిధ ఛాయల్లో అర్థాలున్నాయి. ఆత్మాభిమానం లేనివాడే అబద్ధాలాడతాడు మాటమీద నిలబడని వాడు దేనిమీదా లేనట్టే. వాక్కర్మలకు ఏకత్వ ముండా

లంటున్నాడు వేమన్న. దుఃఖాన్నీ, బాధనీ వ్యక్తపరచుకోవటాన్ని గోడు అంటారు. అనుభూతి లేనివాడికి అది గొడవగానే ఉంటుంది. మోసం చెయ్యటంలో అనేక రకాలుంటాయి. కాని కొన్నాళ్ళు కలిసిఉండి నమ్మించి హాని చెయ్యటం దారుణం, క్రూరం అంటున్నాడు వేమన్న.

అన్నమధికమైన నదియు తా జంపును
అన్నమంటకున్న ఆత్మ నొచ్చు
చంపనొంప బువ్వ చాలదా వెయ్యేల?
విశ్వదాభిరామ వినురవేమ

తిండిలేక ఒకడు చస్తే, తిండెక్కువై పరొకడు చచ్చాడు, అని సామెత.

కాల వ్యవధినివ్వక, పరిమితిలేక ఎప్పుడూ తినేవాడికి జీర్ణకోశాది వ్యాధుల్తో దేహారోగ్యం దెబ్బతిని చావుకు దారితియ్యొచ్చు. అన్నం లేనివాడు పోషణ లేక బాధపడతాడు. చంపటానికైనా కుంగదీయటానికైనా తిండే కారణమంటున్నాడు వేమన.

డబ్బున్నవాడు బంగారం తింటాడా? ఉందిగదా అని హితాహితాలు చూడక తెగతినేవాడు రోగాలపుట్టగా మారతాడు. అన్నం దొరకనివాడి ఆకలిమంట వాడి పేగుల్నీ, వాడి బతుకునే కాల్చేస్తుంది. ఎవడికి కావలసిం దయినా పిడికెడు బువ్వేనంటాడు వేమన. బంప అంటే అణచుట.

ఒకే వస్తువు (ఉపకరణం) మంచికీ చెడుకూ కూడా ఉపయోగపడు తుంది, అనే పద్ధతిలో కూడ ఈ పద్యానికి వ్యాఖ్యానం చెప్పుకోవచ్చు.

వీరశైవంలో అన్నదానానికి ప్రాధాన్యముండేది. అన్నపూర్ణను సృష్టించింది శైవమే నంటారు.

హీనుడెన్ని విద్య లిల నభ్యసించిన
ఘనుడు గాడు హీన జనుడెగాని
పరిమళముల గార్దభము మోయ ఘనమౌనె
విశ్వదాభిరామ వినురవేమ

చదువుకూ సంస్కారానికీ సంబంధం లేదు. ఎన్ని విద్దెలు నేర్చినా, శాస్త్రాలు చదివినా వాడి స్వభావ గుణమైన హీనత్వం పోదు. ఆ విద్యవల్ల వాడి మనస్తత్వమేమి మారదు. సువాసనలు వెదజల్లే గంధపుచెక్కల మూటను మోసినంతమాత్రాన గాడిదకు ఆ సౌరభ మబ్బుతుందా?

ఆచరణకు రాని విద్య మెదడుకు భారమే గాడిద బరువులాగ. చతుర్వేద సకలశాస్త్ర పారంగతుడికి మానవతా దృష్టి, సరసతా లేకపోతే ఆ వైదుష్యాలన్నీ ఎందుకంటున్నాడు వేమన.

"గార్దభము మోయ గజమౌనె"

(డి 1735; 344) అనే పాఠం ఉంది. మదజల సౌరభానికి అన్వయించి కవితాపరంగా అర్థం చెప్పవచ్చు కానీ గార్దభపరమైన అర్థమే వాస్తవికంగా ఉంది. కాశ్మీరగార్దభా లుంటాయి. అవి కుంకంపువ్వు మోసుకొస్తాయి. కాని దాని సౌరభం వాటికి తెలియదు.

పసుల వన్నెవేరు పాలేక వర్ణమౌ
పుష్పజాతి వేరు పూజ ఒకటి
దర్శనములు వేరు దైవంబు ఒక్కటి
విశ్వదాభిరామ వినురవేమ

నలుపు తెలుపు ఎరుపు అంటూ పశువులు వివిధరంగుల్లో ఉంటాయి

కాని అవి ఇచ్చే పొలది ఒకేరంగు, తెలుపు. పువ్వుల్లో రకాలు అనే
క్యాకం. కాని వాటిలో దేన్నైనా దేవుడికి సమర్పించేటప్పుడు చేసే పూజ
ఒకటే. ధర్మాలు అనేకమైనా వాటిద్వారా చేరేది ఒక దేవున్నే.

వేదాంతసారాన్ని దర్శనమంటారు. ఒక జీవిత విధానాన్ని విశదపరి
చేది దర్శనం. నూతన పద్ధతులను బోధించే ప్రతి తాత్త్వికుడికీ ఒక ప్రత్యేక
దర్శనం ఉంటుంది. దర్శనాలెన్నైనా వాటి గమ్యమొక్కటే అంటున్నాడు
వేమన్న.

నేర్చి నడతునన్న నేరమి తావచ్చు
ఓర్చి నడతునన్న నోర్పురాదు
కూర్చి నడతునన్న కూడంగ నియ్యదు
విశ్వదాభిరామ వినురవేమ

"నాకంతా తెలుసు" అని పని మొదలుపెట్టేవాడు క్రమంగా తన
తెలియవితనాన్ని తెలుసుకుంటాడు. సహనశీలి ననుకున్నవాడు కూడ
ఎక్కడో చిరాకుపడతాడు. పెద్ద నిర్వాహకుణ్ని అనుకున్నవాడికి కూడ
అపజయం ఎదురవుతుంది.

క్రియాశీలి కార్యక్రమ విధానంలో లభించిన ప్రతి అనుభవం నుంచి
నేర్చుకోవాలి అని వేమన్నవాదం. నేరమి అంటే అజ్ఞానం అనీ, కూర్చుట
అంటే నిర్వహించటం అనీ అర్థాలు. కూడంగ నియ్యదు అంటే గెలువ
నియ్యదు అని అర్థం.

తరువ తరువ పుట్టు తరువున ననలంబు
తరువ తరువ పుట్టు దధిని ఘృతము
తలప తలప పుట్టు తనువున తత్త్వంబు
విశ్వదాభిరామ వినురవేమ

రాపిడి పడేకొద్దీ చెట్టులోనుంచి అగ్గి పుడుతుంది. చిలికే కొద్దీ పెరుగులోంచి వెన్నపుట్టి నెయ్యి లభిస్తుంది. అదేపనిగా తపనపడే కొద్దీ సత్యానుభూతి కలుగుతుంది.

చెట్టును కాల్చే అగ్ని చెట్టులోంచే పుడుతుంది. పెరుగు స్వరూపమే మిగలని నెయ్యి పెరుగులోంచే పుడుతుంది. శరీర స్పృహను మరిపించే అనుభవం శరీరంలోంచే కలుగుతుంది. కనిపించే పదార్థాల తత్త్వం నిరంతర సాధనవల్ల అవగత మవుతుందంటున్నాడు వేమన్న. 'తరచు' అనే క్రియనుంచి తరచ అనే అర్థంలోనే తరువ అనే రూపం ఉంది.

చదవ చదవ చదవ సభలందు రంజిల్లు
పెనగ పెనగ సతికి ప్రేమపుట్టు
వినగ వినగ మాట విశ్వాసమై ఉండు
విశ్వదాభిరామ వినురవేమ

చదివేకొద్దీ సభల్లో రాణింపు వస్తుంది. కలిసి జీవించేకొద్దీ సతికి ప్రేమ కలిగి ఆ మాధుర్యం అనుభవంలోకి వస్తుంది. వినేకొద్దీ మాటమీద గురి, నమ్మకం కలుగుతాయి.

ఏ పనయినా చేయగా చేయగా అనుభవంలోకి వస్తుందని వేమన్న వాదం.

వేమన పద్యాల్లో పదాల ఆవృత్తులు కొట్టొచ్చినట్టు కనపడే ప్రత్యేకత తెలుగులో కొన్ని అసమాపక క్రియలను పునరుక్తం చెయ్యటం ద్వారా కాలాధిక్యాన్ని, క్రియాధిక్యాన్ని సూచించొచ్చు.

చెప్పి చెప్పి విసుగొచ్చింది, తినక తినక తిన్నాడు, చెప్తూ చెప్తూ ఆగిపోయాడు, ఇట్లాంటివి. వీటిని పద్య నిర్మాణంలో వేమన నేర్పుగా వాడుకున్నాడు.

అరయ తరచు కల్లలాడెడు వారిండ్ల
వెడలకేల లక్ష్మి విశ్రమించు
ఓటి కుండ నీరువోసిన చందాన
విశ్వదాభిరామ వినురవేమ

కలిమి కలిగిన వానికి కరుణకూడ ఉండాలి. అర్థిని 'రేపురా మాపురా' అని తిప్పించుకునేవాడు, ఇనప్పెట్టెలో డబ్బున్నా ఎప్పుడూ అబద్ధాలాడి, లేద అరుపులు అరిచేవాడు నిజంగానే దరిద్రుడౌతాడు. పగులు పట్టిన కుండలో నీళ్ళు నిలవ నట్టే కల్లపలికే వాడింట్లో లక్ష్మి, అంటే ధనం, నిలవదు.

అంకిలెరిగి మాటలాడ నేర్చినపుడె
పిన్న పెద్దతనము లెన్న నేల
పిన్న చేతి దివ్వె పెద్దగా వెలగదా
విశ్వదాభిరామ వినురవేమ

ఆటంకాన్ని గుర్తించినమాట, చింత తొలగించేమాట చిన్నవాడు

చెప్తే మాత్రమేమి? వయస్సుతో పనిలేదు, పసివాడి చేతిలో ఉన్న దీపం పెద్ద వెలుగు నివ్వదా? అని ప్రశ్నిస్తున్నాడు వేమన.

తెలివికీ, తెలియజెప్పటానికీ చిన్న పెద్దలు లెక్కకు రావాల్సిన అవసరం లేదు. లంకిలి అంటే విఘ్నం, వ్యాకులం అని అర్థాలు. అను వెరిగి మాట్లాడేవాడు సందర్భానికి మెరుపులా ఆలోచించేవాడు యువకుడైనా, వృద్ధుడైనా ఒకటే.

సందర్భమెరిగి మాట్లాడే నేర్పు వయసుతో వచ్చేది కాదని, తెలివి తేటలవల్ల వస్తుందని వేమన భావం. మాట్లాడే వాడు చిన్న వాడయినంత మాత్రాన అతని మాటల్ని చిన్నతనంగా చూడక్కర్లేదని వేమన్న హెచ్చరిక.

ఊరునూరు తిరిగి ఉద్యోగధారియై
వాడవాడ దిరుగు వనిత కొరకు
ఏడనేడ దిరిగి ఏమేమి కనెనయా
విశ్వదాభిరామ వినురవేమ

సంచారం లేని జీవితానికి చైతన్యం లేదు. వేమన్న సంచార జీవితం ప్రదర్శించే పద్యాలు కోకొల్లలు. కొండవీడు, గండికోట, తిరుమల, గోదావరి, నందిదుర్గం, శ్రీశైలం, తమిళ, కర్ణాటక మొదలైన అనేక ప్రాంతాలను పేర్కొన్నాడు. ఈ ఊర్ల పేర్ల లో కూడా వేదాంతార్థాలను చూడటం పాండిత్య ప్రదర్శనకు మాత్రమే పనికి వస్తుంది. వేమన్న 'నోమాదే (Nomad+ఏ) కాని (No-mad) అని చమత్కారంగా చెప్పొచ్చు. అనుభవాలు అందరికీ తటస్థిస్తాయి కాని అనుభవాలుగా మారే దెందరికి? ఉద్యోగంతో ఉరుకులు కొన్నాళ్ళు, పదవి కోసం పరుగులు

కొన్నాళ్ళు; ఎక్కడ తిరిగినా, ఎంత తిరిగినా ఏమి కనిపించింది, ఏమి మిగిలింది అని వాపోతున్నాడు వేమన్న. తనకు తెలిపిందెంత? తెలిపి ప్రపంచాన్ని మార్చగలిగిందెంత?

దేశమంతా తిరిగి ఊరు చేరుకున్న వాడికి ఊళ్ళో లోపాలు స్పష్టంగా కనిపిస్తాయి. ఇన్నాళ్ళు ఈ లోపాల్లో భాగస్వామిని కదా అనిపిస్తుంది. ఊర్వి తిరిగొచ్చిన వాడికి ఊరు కనిపించాలి అని వేమన్న వాదం.

# పద్య సూచిక

# హైదరాబాద్ బుక్ ట్రస్ట్

## ప్రస్తుతం మా దగ్గర ఉన్న పుస్తకాల వివరాలు

చరిత్ర :

1. కాకతీయుల కాలం నాటి సామాజిక జీవితం - మలయశ్రీ
2. ప్రాచీన భారత దేశ చరిత్ర - డి.డి. కోశాంబి
3. తరతరాల భారత చరిత్ర - రొమిలాథాపర్
4. ఆధునిక భారత చరిత్ర - బిపిన్ చంద్ర
5. ఆంధ్రుల సంస్కృతి చరిత్ర - 1 - కంభంపాటి సత్యనారాయణ
6. ఆంధ్రుల సంస్కృతి చరిత్ర - 2 - కంభంపాటి సత్యనారాయణ
7. చరిత్ర అంటే ఏమిటి ? - ఇ.హెచ్.కార్
8. ప్రపంచ చరిత్ర - క్రిస్ బ్రెజియర్
9. భారత చరిత్ర పరిచయ వ్యాసాలు - డి.డి. కోశాంబి
10. చరిత్రలో ఏం జరిగింది - గార్డెన్ చైల్డ్
11. చరిత్రలో సతి - రొమిల్లా థాపర్
12. 1886 - ఉరికొయ్యలు - చెరసాలు

జీవిత చరిత్ర :

1. రక్తాశ్రువులు - టెడ్ ఆలెన్, సిడ్నీగోర్డెన్
2. అంబేద్కర్ - డా॥ బి. విజయభారతి
3. నెల్సన్ మండేలా - మేరీ బెన్సన్
4. జోతిరావ్‌పూలే - రోజలిండ్ ఓ'హన్‌లన్
5. రేడియం మహిళ మారీక్యూరి - గీతా బందోపాధ్యాయ

విజ్ఞాన శాస్త్రం :

1. విజ్ఞాన శాస్త్రం ఎలా ఎదిగింది -ఎగోన్‌లార్‌సెన్
2. విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ - జె.డి. బెర్నాల్
3. సమాజం - విజ్ఞానం శాస్త్రం - డి.డి. కోశాంబి

తత్వశాస్త్రం :

1. లోకాయుత - శునకాలు మంత్రాలు - దేవిప్రసాద్ చటోపాధ్యాయ
   లోకాయుత - అసుర - దేవిప్రసాద్ చటోపాధ్యాయ
2. భగవద్గీత - చారిత్రక పరిణామం - డి.డి. కోశాంబి
3. రామాయణం - పెరియార్ రామసామి
4. అంబేద్కర్ ఊహలో రాజ్యాంగ లక్ష్యం - చిన్నప్పరెడ్డి
5. వేదాల్లో ఏమున్నది - కొడవటిగంటి కుటుంబరావు

కథలు - నవలలు

1. తిళిదాన్ - మిహైల్ షోలకోవ్
2. దెయ్యాలున్నాయి జాగ్రత్త - మహాశ్వేతాదేవి
3. భూగర్భయాత్ర - జూల్స్‌వెర్న్
4. ఒక తల్లి - మహాశ్వేతాదేవి
5. బషాయిటుడు - మహాశ్వేతాదేవి
6. ఏడు తరాలు - ఏలెక్స్ హేలి
7. టాల్‌స్టాయ్ కథలు
8. బతుకుపోరు - బి.ఎస్. రాములు
9. తెలుగుకథ 1962 - 85 - వాసిరెడ్డి నవీన్

| | |
|---|---|
| పగటి కల - గిజుభాయి | 15-00 |
| **ఆరోగ్యం** | |
| వైద్యుడు లేని చోట - డేవిడ్ వర్నర్ | 120-00 |
| **ఆర్థిక శాస్త్రం** | |
| 1. భారతీయ పారిశ్రామిక పరిణామం - డి.ఆర్. గాడ్గిల్ | 22-00 |
| 2. భారతీయ ఆర్థిక వ్యవస్థ 1600-1947 - కె.ఎస్.గిల్ | - |
| **పౌరహక్కులు / చట్టాలు** | |
| 1. పోలీసులు అరెస్టు చేస్తే - బొజ్జాతారకం | 12-00 |
| 2. కనీస వేతనాల చట్టం | 2-50 |
| 3. ప్రజలు సమస్యలు | 2-50 |
| 4. ప్రజలు - చట్టాలు | 3-00 |
| 5. పేదలకు సహాయ సాధనంగా చట్టం - మా అనుభవాలు | 3-00 |
| **సాహిత్య విమర్శ** | |
| మరోసారి గిడుగు రామమూర్తి - నిర్వాహకుడు చకూర రామారావు | 16-00 |
| **కార్టూన్ సీరీస్** | |
| 1. క్యూబా - ర్యూసో | 8-00 |
| 2. లెనిన్ - రిచర్డ్ అపిన్యానేసి, అసార్ జరాటే | 10-00 |
| 3. మావో - ర్యూసో | 10-00 |
| 4. మార్క్సురాసిన పెట్టుబడి - డేవిడ్ స్మిత్, ఫిల్ ఇవాన్స్ | 12-00 |
| **కులం, అధ్యయనాలు** | |
| 1. కుల నిర్మూలన - అంబేద్కర్ | 12-00 |
| 2. శూద్రులు - ఆర్యులు - అంబేద్కర్ | 5-00 |
| 3. అంటరానితనం - పెరియార్ రామసామి | - |
| 4. కులం - వర్గం - బొజ్జాతారకం | 12-00 |
| 5. శూద్ర వర్ణం ఎలా పుట్టింది - ఆర్.యస్.శర్మ | 28-00 |
| 6. రాముని కృష్ణుని రహస్యాలు -అంబేద్కర్ | 9-00 |
| 7. వ్యక్తిత్వాన్ని గౌరవించే పెళ్ళిళ్ళు - పెరియార్ రామసామి | 7-00 |
| **అభివృద్ధి అధ్యయనాలు** | |
| శాస్త్ర విజ్ఞానం అభివృద్ధి హింస - క్లాడ్ అల్వారిస్ | 15-00 |
| **ఇతరులు** | |
| వేమన్న వాదం - డా॥ ఎన్. గోపి | - |
| మనభూమి | 20-00 |

## త్వరలో రాబోయే ప్రచురణలు

- ★ నవాలక్ష సందేహాలు - స్త్రీలు సమస్యలు (Revised)
- ★ Child & the State - *Myron Weiner*
- ★ Learning Through Conflict - *Prof. Krishna Kumar*
- ★ Pesticide Conspiracy - *Van Der Bosch*
- ★ Soil & Civilization - *Edward Hyams*
- ★ The struggle for survived - *Prof. Heimendorf*
- ★ Essays on under development in Telangana

---